Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 22 • 3-6-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# అవిశ్వాస ప్రయత్నం అభాసుపాలే!

- నవ్వులపాలు కానున్న జగన్ సవాళ్లు.
- కిరణ్‌కు కలిసి వస్తున్న జగన్ వ్యూహం.
- ఆ పరీక్షతో సర్కారుకు శ్రీరామరక్ష.
- జగన్ వర్గం ఎమ్మెల్యేలకు ఇరకాటం.
- ఏ ఎమ్మెల్యే కూడా సిద్ధంగా లేడు.

తెలుగుదేశం పార్టీ అవిశ్వాసం పెడితే కిరణ్‌కుమార్ రెడ్డి సర్కారును తాను కూలదోస్తానని గత రెండు వారాలుగా జగన్ చేస్తున్న సవాళ్లు వికటిస్తున్నాయి. తన బలం ఎంతో అంచనా వేసుకోకుండా, రాజకీయ పరిస్థితులను సరిగా బేరీజు వేసుకోకుండా పిల్ల చేష్టల వలె జగన్ పన్నిన వ్యూహం చివరకొచ్చేసరికి ఆయనకే ఎదురు తిరుగుతున్నది. వికటించి, విషమ ఫలితాలను అందించబోతున్నది.

కడప ఉప ఎన్నికలలో లభించిన అనూహిత మెజార్టీ జగన్‌లో ఆత్మవిశ్వాసాన్ని అమితంగా పెంచింది. భవిష్యత్తులో రాష్ట్రాధికారం తనదే అన్న నమ్మకం కల్గించింది. ఎన్నికలంటూ వస్తే కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు రెండూ మట్టి కొట్టుకపోవడం ఖాయమన్న ధీమాకు వచ్చారాయన. ఆ ధైర్యంతో అవిశ్వాసం పెట్టి, కిరణ్‌కుమార్ రెడ్డిని గద్దె దించితే ఎన్నికలు వచ్చి, తన జీవితకాల వాంఛ నెరవేరుతుందని భ్రమపడ్డాడు. కానీ ఆ వ్యూహం ఇప్పుడు అన్ని విధాల బెడిసి కొడుతున్నది.

జగన్ దగ్గర ఎంత గట్టిగా లెక్క వేసినా పాతిక మంది ఎమ్మెల్యేలు లేరు. తెలుగుదేశం దగ్గర వున్నది 86 మంది మాత్రమే. ఈ రెండు సంఖ్యలు కలిసినా కిరణ్ సర్కారును కూలదోయడానికి తగిన అంకె రాదు. ఒకవేళ టిఆర్‌ఎస్ మద్దతు ఇస్తుందనుకొన్నా లాభం లేదు. కాంగ్రెస్‌లో ఇప్పుడు కనీసం 135 మంది నికరంగా మిగిలి వున్నారు. ప్రజారాజ్యం నుంచి ఎంత లేదన్నా 16 మంది వస్తారు. మజ్లిస్ సభ్యులు ఏడుగురున్నారు. సిపిఐ, సిపిఎం వాళ్లు ముగ్గురున్నారు. ఈ లెక్క చూస్తే 162 దాటుతుంది. శాసనసభలో మొత్తం ఎమ్మెల్యే సంఖ్య 294. అందులో సగం 147 మాత్రమే. ఆ లెక్కన చూసినప్పుడు కిరణ్‌కు కావల్సిన దానికంటే కనీసం 15 మంది వరకు అదనంగా మిగులుతున్నారు. అందువల్ల అవిశ్వాసం పెట్టి సాధించేది ఏదీ లేదు. పైగా జగన్ దగ్గరున్న ఎమ్మెల్యేలలో ముప్పాతిక భాగం అవిశ్వాసానికి సిద్ధంగా లేరు. పదవులు వదలుకోవడం వారికి ఇష్టం లేదు. ఎన్నికలలో తమకు టిక్కెట్లు వస్తాయా, వచ్చినా గెలుస్తామా అన్న స్పష్టత లేనప్పుడు మూడేళ్ల పదవీ కాలాన్ని చేజేతులా వదలుకోవడం ఎందుకన్నది వారి ఆలోచన.

ఈ లెక్క పక్కలు సరి చూసుకోకుండా తొందరపడ్డాడు జగన్. తాను కన్నెర్ర చేస్తే కిరణ్ ప్రభుత్వం

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్



'జనాభా నియంత్రణ' అవార్డు కావాలని వచ్చాయట సార్!

## కొత్త ఎస్పీ పోస్టింగ్‌కు రఘువీరా సిఫార్సు

నెల్లూరు జిల్లా పోలీసు సూపరింటెండెంట్ దామోదర్‌ను మార్చి, రమణకుమార్‌ను నియమించింది ప్రభుత్వం. దామోదర్ మీద జిల్లా కాంగ్రెస్‌వాదులందరిలో అసంతృప్తి వుంది. ఆయన ఒక కులానికి, తనను ప్రీతిపరచే వారికి మాత్రమే పని చేస్తున్నారని, జిల్లాలో పోలీసు వ్యవస్థను నాశనం చేశాడని పలువురు ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేశారు. మరొకప్రక్క హోంగార్డ్స్ నియామకంలో దామోదర్ కక్కుర్తి పడ్డాడని డిజిపి అరవిందరావు ఆగ్రహంతో వుండినాడు. ఈ రెండూ కలిసి దామోదర్‌ను అకాలంగా బదలీకి గురి చేశాయి.

కొత్త ఎస్పీ రమణకుమార్ నెల్లూరుకు పాత పరిచయస్తుడే. గతంలో ఆయనిక్కడ డిఎస్పీగా పని చేశాడు. ఆయన సతీమణి శ్రీమతి ఉదయలక్ష్మి జిల్లా స్థాయి పదవులలో పని చేశారు. టిటిడి విజిలెన్స్ అధికారిగా రమణకుమార్ పని తీరు పలు సంచలనాలకు కారణమైంది. డాలర్ శేషాద్రి బంగారు డాలర్ల కుంభకోణంపై నివేదిక ఇచ్చింది కూడా ఆయనే. రెవెన్యూ మంత్రి రఘువీరారెడ్డి సిఫార్సుతో ఆయన

కొరవ 14వ పేజీలో

# రామ్‌దేవ్ సమర శంఖం

బాబాలు, అమ్మలంటే మాయల మరాఠీలుగా మాత్రమే తెలుసు మనకు. గారడీ విద్యలను తలపించే మహత్యాలతో ప్రజలను ఆకట్టుకోవడం, ఆధ్యాత్మిక బోధనలు చేయడం, జాతకాలు చెప్పి ఆశీర్వాదాలు ఇవ్వడం వరకే సంఘ జీవనంలో వారి పాత్ర పరిమితం. కానీ బాబాల లోకంలో ఒక కొత్త అధ్యాయానికి శ్రీకారం చుడుతున్నాడు యోగా గురువు బాబా రామ్‌దేవ్. దేశంలో పెచ్చరిల్లిపోయిన అవినీతి నిర్మూలనకు అన్నా హజారే అంటించిన కాగడాను తన చేత పట్టుకోవడానికి సిద్ధమౌతున్నాడు. నల్లధనాన్ని జాతీయ ఆస్తిగా ప్రకటించి, ప్రభుత్వ స్వాధీనం చేసుకోవాలని, బలమైన లోక్‌పాల్ వ్యవస్థ నిర్మాణం జరగాలని, అవినీతిపరులకు మరణశిక్ష విధించేట్లు చట్టం తేవాలని, పౌర సేవలకు ప్రభుత్వం చట్ట రూపంలో హామీ ఇవ్వాలని కోరుతూ 4తేదీ ఉదయం నుంచి ఢిల్లీ రామలీల మైదానంలో ఆమరణ దీక్ష సంకల్పించారాయన.

లోక్‌పాల్ బిల్లు కోసం అన్నా హజారే దీక్ష ప్రకటించినపుడు కేంద్ర ప్రభుత్వం చాలా తేలికగా తీసుకొన్నది. జంతర్‌మంతర్‌లో రోజూ జరిగే నిరసన దీక్షలతో సమానంగా పరిగణించి, నిర్లక్ష్యం చేసింది. కానీ మూడంటే మూడు రోజులలో అన్నా హజారే ఉద్యమం దావానలం వలె వ్యాపించింది. కోట్లాది మంది మధ్య తరగతి ప్రజలు ఆయనకు బాసటగా నిలిచారు. దేశంలోని ప్రతి పల్లెటూరు, పట్టణం హజారే నినాదాలతో మార్మోగిపోయాయి. ఆ తాకిడికి తట్టుకోలేక కేంద్ర సర్కారు కాళ్ల బేరానికి రాక తప్పలేదు.

హజారేకు, బాబా రామ్‌దేవ్‌కు చాలా వైరుధ్యాలున్నాయి. హజారే నిరాడంబర సంఘ సేవకుడు. రామ్‌దేవ్ విలాస జీవితం గడిపే యోగా గురువు. హజారేకు సంఘ సేవ తప్ప మరొక ధ్యాస లేదు. రామ్‌దేవ్‌కు స్వంత పార్టీ పెట్టుకోవాలన్నంతగా రాజకీయ ఆశలున్నాయి. హజారే ఎర్ర బస్సుల్లో, మూడవ తరగతి రైలు పెట్టెల్లో ప్రయాణిస్తుంటాడు. రామ్‌దేవ్ ఛార్టర్డ్ విమానాలలో విహరిస్తాడు. అయితే మధ్య తరగతి ప్రజలలో హజారేకంటే రామ్‌దేవ్‌కు ఆదరణ ఎక్కువ. గత ఇరవై ఏళ్లుగా యోగా అవసరాన్ని ప్రచారం చేస్తూ దేశమంతా తిరిగాడాయన. లక్షలాది మంది ఆయన్ను తమ గురువుగా భావిస్తారు. హజారేకు ఎటువంటి ఆర్థిక వ్యవహారాలూ లేవు. స్వంత ఆస్తి లేదు. రామ్‌దేవ్‌కు ఆయుర్వేద ఔషధాల పరిశ్రమ వుంది. వాటిలో ఎముకల పొడి కలుపుతున్నారని సిపిఎం నేత బృందా కారత్ ఒకసారి పెద్ద ఉద్యమం నడిపింది. వీరిద్దరి మధ్య వున్న ఒకే ఒక పోలిక – పాలనా వ్యవస్థకు పట్టిన అవినీతి చెద వదిలించాలన్న పట్టుదల.

దేశ ప్రజలలో కూడా ఆ కోరిక బలీయంగా వుంది. అందువల్లనే హజారే దీక్షకు అంతస్థాయిలో అనూహిత మద్దతు లభించింది. ఇప్పుడు రామ్‌దేవ్ లేవనెత్తిన నల్లధనం సమస్య మీద కూడా ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి వుంది. సరైన రీతిలో దానికి అగ్గి పుట్టించగలిగితే దావానలం వలె విస్తరిస్తుందనడంలో అతిశయోక్తి లేదు. అందువల్లనే కేంద్ర ప్రభుత్వం అంతగా భయపడి పోతున్నది. రామ్‌దేవ్ చేత దీక్ష విరమింప చేయడానికి ప్రణబ్ ముఖర్జీ వంటి నేత కూడా విమానాశ్రయానికి వెళ్లి రామ్‌దేవ్ కరుణ కోసం గంటల తరబడి ఎదురుచూపులు చూశాడు.

నల్లధనంపై ఇప్పటికే ఎంతో చర్చ వుంది. స్విస్ బ్యాంకులలో భారతీయులు దాచిన నల్లధనం పరిమాణం 50 నుంచి 70 లక్షల కోట్ల రూపాయల వరకు వుంటుందన్న ప్రచారం వుంది. సుప్రీంకోర్టు కూడా ఈ సమస్య మీద విచారణ జరుపుతున్నది. కానీ ఏ కారణం వల్లనో కేంద్ర ప్రభుత్వం మాత్రం ఆ చెద పురుగు నిర్మూలనకు చిత్తశుద్ధితో ప్రయత్నం చేయడం లేదు. రామ్‌దేవ్ పుణ్యంగా అయినా ప్రభుత్వంలో కదలిక వచ్చి, ఇనుప పెట్టెల్లో, నేల మాళిగలలో, బ్యాంక్ లాకర్లలో దాగి వున్న నల్లధనాన్ని వెలికి తీయగలిగితే దేశానికి పట్టిన పేదరికమనే శాపం నుంచి విముక్తి లభిస్తుంది. ప్రజల జీవన ప్రమాణాలను పాశ్చాత్య దేశాలతో సమానంగా అభివృద్ధి చేయడానికి చేతినిండా వనరులు లభిస్తాయి. ప్రధాన మంత్రి వంటి ప్రభుత్వ నేతలు ఇప్పటికైనా ఈ విషయంలో చురుకైన పాత్ర పోషిస్తారని, నల్లధనం వెలికితీతకు చిత్తశుద్ధితో కూడిన ప్రయత్నం చేస్తారని ఆశిద్దాము.

**జమీన్‌రైతు**

## జనవాణి

### రైతులపై మొసలి కన్నీరు!

ధాన్యానికి గిట్టుబాటు ధర కల్పించమని, ధాన్యాన్ని నేరుగా ప్రభుత్వమే కొనాలని రైతులు మొత్తుకొంటున్నారు. కాని ఈ విషయాలు పట్టని ప్రభుత్వం రైతుచైతన్య యాత్రలను ఊరూరా ప్రారంభించింది. తెలుగుదేశం రహదారులు దిగ్బంధనం చేస్తే, వైఎస్ జగన్ గుంటూరులో 48గంటలపాటు దీక్ష చేశాడు. ఏ పార్టీకి ఆపార్టీ వారు రైతులపై మొసలి కన్నీరు కారుస్తున్నారు తప్ప గిట్టుబాటు ధర ఇచ్చేలా ప్రభుత్వాలను ఒప్పించలేకపోవడం బాధాకరం.

*పి.రమణయ్య* కొడవలూరు

### సమస్యలపురి సింహపురి!

ఆధునాతన నాగరికత, అపార్ట్‌మెంట్లు, విద్య, వైద్య, రాజకీయ, భూస్వామ్య, పారిశ్రామిక కుబేరులకు నివాస స్థలం నెల్లూరు నగరం. ఈ మహానగరంలో సగటు మనిషి దినదినగండం నూరేళ్లాయుష్షుగా బతుకు ఈడ్చుచున్నాడు. క్షణక్షణానికి పెరిగిపోతున్న జనాభా, ద్విచక్ర వాహనాలు, కార్ల పందెములను మరిపించు డ్రైవింగులకు రోడ్ల దురాక్రమణ ప్రతిబంధకంగా నిలుస్తున్నది. రోడ్లపై నడవను జనం నానాపాట్లు పడవలసి వస్తుంది. రోడ్లపైనే వ్యాపారం చేసేవాళ్లు, వాహనాల్లో వెళ్తూ సెల్‌ఫోన్‌లలో మాట్లాడేవారితో జనమే సర్దుకోపోవలసివస్తుంది. నెల్లూరు ట్రాఫిక్ సమస్య పరిష్కారానికి కార్పొరేషన్, రెవెన్యూ, రవాణాశాఖ, పోలీసు అధికారులు సమిష్టి కృషి చేయాలి.

*బి.పట్టాభిరామయ్య* నెల్లూరు

### విఫలమైన నేతలు

పరీక్షకు వెళ్లిన విద్యార్థి ఫలానా ప్రశ్న బాగా వ్రాశాను. పదికి ఎనిమిది మార్కులు రావచ్చు. ఫలానా ప్రశ్న ఒక మోస్తరుగా వ్రాశాను పదికి నాలుగు రావచ్చు అని ఊహిస్తాడు. ఈ తరహాలోనే సుమారు 30ఏళ్ల రాజకీయ అనుభవం వుండి, ఎన్నో ఎలెక్షన్లు చూసి, చేసిన నాయకులు కడపలో వైఎస్ జగన్మోహన్‌రెడ్డి గెలుపుపైన, మెజార్టీపైన అంచనా లేకుండా ఎలాపోతుంది. ఫలితాలకు, ఊహలకు ఎక్కడా పొంతన లేకుండా ఎలాపోయింది? మొత్తానికి ఇక్కడి ఫలితంపై రాజకీయ నాయకులు చేసిన ప్రకటనలు వాళ్లను వాళ్లు మోసం చేసుకోవడానికా? ప్రజలను మోసం చేయడానికా??

*టి.కోటేశ్వరరావు* కోవూరు

### వాగ్వివాదాలకు తావులేదు!

మే 13తేదీ 'జమీన్‌రైతు' సంచిక జనవాణి శీర్షికలో కోవూరుకు చెందిన కోటేశ్వరరావుగారు భగవాన్ సత్యసాయిబాబా కర్మకతువుల గూర్చి వ్రాశారు. వాస్తవానికి అవి కర్మకతువులు కాదు... ఆరాధన. బాబా కుటుంబీకుడైన రత్నా

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**6-6-1941**
**పేజీలు : 10 వెల: అణా**

### సత్యాగ్రహ వార్తలు

జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి మన్నేపల్లి హనుమంతరావు గారు నెల్లూరులో ఆత్మకూరు బస్టాండు వద్ద 4వ తేది ఉదయం 7.30 గంటలకు సత్యాగ్రహం చేయగా అరెస్టయిరి.

***

వెన్నెలకంటి రాఘవయ్యగారు 2వ తేది విడుదలై నెల్లూరు వచ్చిరి. 6పౌనులు హెచ్చిరి.

***

రేబాల దశరథరామిరెడ్డి, పెనుబోలు సుబ్బయ్యశెట్టి గార్లు కూడా విడుదలై వచ్చారు. దశరథరామిరెడ్డి గారు 6 పౌన్లు తగ్గారు.

***

యాగంటి రామలింగం గారిని నెల్లూరు సబ్ జైలు నుండి వదిలేశారు.

### ఏ.సి.సుబ్బారెడ్డి పార్కు

సాయంత్రం 7.30 గంటలకు రేడియో వినవచ్చేవారు రంగనాయకుల తిరునాళ్ల ప్రజ అవుతున్నారు. ప్రభుత్వం వారు సంకల్పించిన ప్రచారం మహత్తరంగా జరుగుచున్నది. కానీ పార్కులో ఇసుక రేణువుల కంటే బీడి ముక్కలే జాస్తిగా వున్నవి. కూర్చోబోతే అసహ్యంగా వున్నది.

మునిసిపాలిటీ వారు వారానికి ఒకసారి అయినా ఇసుకగెలికి శుభ్రంచేసి, కొత్త ఇసుక చేర్చకపోతే ఆ చోటు పూర్వ అవతారం దాలుస్తుంది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**2-6-1961**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### రైల్వే పోలీస్‌స్టేషన్‌పై దాడి

గత 27వ తేది రాత్రి 8.45 గంటలప్పుడు కొందరు రౌడీలు నెల్లూరు రైల్వేస్టేషన్‌ను ఆనుకొని వున్న రైల్వే పోలీస్ ఔట్ పోస్టును ముట్టడించి, ఇరువురు కానిస్టేబుల్స్‌ను గాయపరచి, రికార్డును చిందరవందర జేసి, భయోత్పాతం కల్గించినట్లు తెలుస్తున్నది. ఈ సందర్భంలో గుండ్లపల్లి రత్తయ్య, కాకి దేవదానం, షేక్ మస్తాన్, వేదం వెంకటయ్యలు అరెస్టు గావింపబడ్డారు. ఇంకొక నలుగురు పరారీలో వున్నారట. వీరందరూ సర్వేపల్లి కాలువగట్టున కొత్త ట్రంకురోడ్డులో నివాసముండేవారని, కపాడిపాళెమునకు చెందినవారని అంటున్నారు.

### నాయకర్ వారసుడు నాడారు

ద్రవిడ కజగం నాయకుడు పెరియార్ ఇ.వి.రామస్వామి నాయకర్ తన వారసుడుగా మద్రాసు ముఖ్యమంత్రి కామరాజు నాడారును నియమించాడు. 85 ఏండ్ల వృద్ధుడైన నాయకర్ ఇలా అన్నారు. "నేను ముసలివాణ్ణయి పోయాను. నేను ఇంకెంతో కాలం జీవించకపోవచ్చు. నా తదనంతరం తమిళుల హక్కులను కామరాజు రక్షిస్తాడు. నాడారు నా వారసుడు".

మద్రాసులో నాడారు నాయకత్వ విజయ కారణాలలో నాయకర్ సానుభూతి గూడా ప్రధానమైనదని దీనిని బట్టి ఊహించదగి వుంటుంది.

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| బంగారు సవర | 95–0–0 |
| సవరెత్తు బంగారు | 92–0–0 |
| వెండి తులం 1.కి | 2–6–0 |

# నెల్లూరు ముచ్చట్లు

## జడ్పీ సిఇఓగా జయరామయ్య!

జడ్పీ సిఇఓగా జయరామయ్య 30వ తేది బాధ్యతలు స్వీకరించారు. గతంలో ఈయన డిఆర్వోగా నెల్లూరులో విధులు నిర్వహిస్తూ బదలీ అయ్యి మంత్రి రామనారాయణరెడ్డి సహకారంతో ఈ పదవిని పొందగలిగారు.

## పాత రికార్డు వేసిన ప్రసన్న!

కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్ రెడ్డి తెలుగుదేశం పార్టీని తిట్టడం పనిగా పెట్టుకొన్నాడు. 30వ తేది మరోసారి చంద్రబాబు నాయుడిని తిట్టారు. ఎన్టీఆర్‌ను చెప్పులతో, రాళ్లతో కొట్టించిన బాబును మించిన దుష్టశక్తి తెలుగుదేశం పార్టీలో మరొకరు లేరన్నారు. మహానాడులో రాజకీయం, బంధుత్వాలు వేరని చెప్పిన బాబు తన కొడుకు లోకేష్‌ను రాజకీయాల్లోకి ఎందుకు ప్రేరేపిస్తున్నారో చెప్పాలన్నారు. తెలుగుదేశం పార్టీ పగ్గాలు నందమూరి కుటుంబానికి అప్పజెప్పకబోతే పార్టీకి భవిష్యత్తు వుండదని తేల్చి చెప్పారు.

## వివేకా కస్సు బుస్సు

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డికి కోపం వచ్చింది. తనకు తెలియకుండా ఆచారివీధిలోని మొగళ్లవారి సత్రంలో మరమ్మత్తు పనులు చేస్తున్న దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్‌పై చిందులు తొక్కాడాయన. ఫిక్స్‌డ్ డిపాజిట్లను తీసి ఖర్చు చేసే అధికారం నీకెవరిచ్చారని ఆయన్ను గదమాయించడంతోపాటు ఈ అధికారిని తక్షణం బదలీ చేయను వివేకానంద రెడ్డి గుంటూరు డిప్యూటీ కమిషనర్‌కు స్పాట్ నుంచే ఫోన్‌చేసి చెప్పారు.

## నెల్లూరులో ప్రత్యేక పారిశుధ్య ప్రాజెక్ట్!

నెల్లూరు నగరాన్ని పరిశుభ్ర నగరంగా వుంచేందుకు ప్రత్యేక ప్రాజెక్ట్ మంజూరు చేశారు. రాష్ట్రంలోని 11 నగరాలను ఈ ప్రత్యేక ప్రాజెక్ట్‌కు ఎంపిక చేశారు. అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజ్ ఆఫ్ ఇండియా(ఆస్కి) నగరాన్ని పరిశుభ్రంగా వుంచేందుకు తీసుకొనవలసిన చర్యలను సిద్ధ పరుస్తుంది. దీనికి కావలసిన నిధులను కేంద్ర ప్రభుత్వం మంజూరు చేస్తుంది.

## భెల్ సిఎండి రాజీనామా

వెంకటగిరి సమీపంలో నెలకొల్పుతున్న విద్యుదుత్పాదన పరికరాల కర్మాగారం(భెల్) సిఎండి సిపిసింగ్ తన పదవికి రాజీనామా చేశారు. కర్మాగారం పనులు ప్రగతి పథంలో సాగుతున్న నేపథ్యంలో సిఎండి రాజీనామా చర్చనీయాంశమయ్యింది.

## డైట్‌సెట్

సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుల నియామకానికి అవసరమైన శిక్షణనిచ్చే డైట్ ప్రవేశ పరీక్ష 29వ తేది నెల్లూరులో జరిగింది. 4927 మంది దరఖాస్తు చేసుకోగా 476 మంది గైర్హాజరయ్యారు. నగరంలోని 23 కేంద్రాలలో ఈ పరీక్ష నిర్వహించారు.

## జిల్లా జైలుపై ఆరోపణల వెల్లువ!

నెల్లూరు సెంట్రల్ జైలులో కాసులిచ్చిన ఖైదీలకు సకల సబ్బందు సౌకర్యాలు కల్పిస్తున్నట్లు ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. ఖైదీలకు వారి బంధువులు, సన్నిహితులతో మాట్లాడుకొనేందుకు ప్రతిరోజు అవకాశముంటుంది. డబ్బులివ్వని ఖైదీలకు మెస్ కిటికీల వద్ద, డబ్బులిచ్చిన వారికి జైలు సూపరింటెండెంట్ గదిలోనే కూర్చొని మాట్లాడుకొనే అవకాశం కల్పిస్తున్నట్లు ఈవారంలో ఆధారాలతో సహా వెల్లడయ్యింది. అత్యంత ప్రమాదకరమైన ఐఎస్ఐ తీవ్రవాదులున్న ఈ జైలులో ఇటువంటి కక్కుర్తి పనుల వల్ల భవిష్యత్తులో లేనిపోని సమస్యలు ఏర్పడవచ్చు. ఈ వ్యవహారంపై జిల్లా ఉన్నతాధికారులు జోక్యం చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.




**జొన్నవాడ కామాక్షమ్మ రథోత్సవం సందర్భంగా అన్నదానం చేస్తున్న పందిళ్లపల్లి అరుణమ్మ, పట్టాభిరామిరెడ్డి దంపతులు.**

## బద్రి మంజుల ఆవేదన

తిరుమలలోని ఏడుకొండల స్వామి దర్శనానికి వెళ్తున్న మహిళల పట్ల క్యూకాంప్లెక్స్‌లతోపాటు ఆలయంలో విధి నిర్వహణలో వున్న ఉద్యోగులు అనుచితంగా వ్యవహరిస్తున్నారని తెలుగుదేశం పార్టీ మాజీ కార్పొరేటర్ బద్రి మంజుల ఆవేదన వ్యక్తం చేశారు. 27వ తేది ఆర్థిక మంత్రి రామనారాయణరెడ్డి సిఫార్సు లేఖతో కుటుంబ సమేతంగా తిరుమల వెళ్లిన తనకు ఎదురైన అనుభవాన్ని ధైర్యంచేసి మీడియా ముందుకు వచ్చి చెప్పారామె. దేవదేవుని సన్నిధిలో ఈ దుర్మార్గాలేమిటో అర్థం కావడం లేదు.

## విద్యుత్ బిల్లులు చెల్లించని ప్రభుత్వ శాఖలు

పంచాయితీలు, మునిసిపాలిటీలు, కార్పొరేషన్ కార్యాలయాలతోపాటు పోలీస్‌స్టేషన్ల నుంచి ట్రాన్స్‌కోకు 55 కోట్ల రూపాయలు మేర విద్యుత్ బిల్లులు బకాయిలు పడి వున్నట్లు ఎస్ఇ

కొరవ 14వ పేజీలో

## గోపి గారి సంతాప సభ

యూత్ కాంగ్రెస్, జమీన్‌రైతు, ఉదయం, ఈభూమి పత్రికలకు సుదీర్ఘ కాలం సహాయ సంపాదకుడిగా పనిచేసి ఇటీవల మరణించిన పెన్నేపల్లి గోపాలకృష్ణ సంతాప సభ టౌన్‌హాల్‌లోని పఠన మందిరంలో 8తేది సాయంత్రం జరుగుతుంది. ఈ సభకు మాజీ కేంద్రమంత్రి ముప్పవరపు వెంకయ్య నాయుడు అధ్యక్షత వహిస్తారు. సీనియర్ న్యాయవాది అనంతరామయ్య సంతాప తీర్మానం ప్రతిపాదిస్తారు. ఎమ్మెల్యేలు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, సివి.శేషారెడ్డి, కర్నాటి ఆంజనేయరెడ్డి, ఎల్వీ కృష్ణారెడ్డి, డాక్టర్ కాళిదాసు పురుషోత్తం, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, పి.జానకిరామరెడ్డి, కె.బాలకృష్ణారెడ్డి ప్రసంగిస్తారు. జమీన్‌రైతు పత్రికా సిబ్బంది ఈ సభను నిర్వహిస్తున్నారు.

## మహిళా ప్రాంగణంలో పాస్టర్ కేర్!

నెల్లూరు నగరంలోని మహిళా ప్రాంగణంలో మానసిక వికలాంగులు, హెచ్‌ఐవి బాధిత పిల్లలకు పాస్టర్ కేర్ కేంద్రాన్ని మంత్రి ఆనం రామనారాయణరెడ్డి 28వ తేదీన ప్రారంభించారు. 18 సంవత్సరాలలోపు మానసిక వికలాంగులు, హెచ్‌ఐవి బాధిత పిల్లలకు ప్రతినెల 500 రూపాయల చొప్పున ఈ కేంద్రాల ద్వారా ఆర్థిక సహాయం అందిస్తారు. జిల్లావ్యాప్తంగా ఇప్పటివరకు 81మందిని గుర్తించారు. 2005 ఏప్రెల్ నెలకు ముందు జన్మించిన అనాధ బాలబాలికలకు ఈ పథకాన్ని వర్తింపచేయడంతోపాటు పాఠశాల స్థాయి నుంచి ఇంటర్ వరకు విద్యనందిస్తారు. రాష్ట్ర ప్రభుత్వం ఇటువంటి పిల్లలకు ప్రత్యేకంగా నిధులు విడుదల చేసింది. పాస్టర్ కేర్‌ను ప్రారంభించిన మంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాట్లాడుతూ స్త్రీ, శిశు సంక్షేమానికి రాష్ట్ర ప్రభుత్వం అధిక ప్రాధాన్యతనిస్తుందని చెప్పారు. బాలికలకు ఉచితంగా విద్యనందించడంతోపాటు, వారికవసరమైన వృత్తి విద్యలో శిక్షణ కూడా ఇప్పించి అన్నివిధాలుగా సహకరించడం జరుగుతుందన్నారు. ఈ కార్యక్రమంలో ఐడిసిఎస్ పిడి శారద, జిల్లా కలెక్టర్ శ్రీధర్, అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య, రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పాల్గొన్నారు.



పాస్టర్‌కేర్‌ను ప్రారంభిస్తున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి.

## రైల్లో రిజర్వేషన్‌కు యమ డిమాండ్

వేసవి సెలవుల్లో విహారయాత్రలకు వెళ్లేవారి సంఖ్య అధికంగా వుంటుంది. వివాహాలు, కుటుంబసభ్యులతో గడిపేందుకు, పుణ్యక్షేత్రాలు దర్శించుకొనేందుకు వివిధ ప్రాంతాలకు వెళ్లేవారు రైలు ప్రయాణానికే ప్రాధాన్యమిస్తారు. ముందుగానే రిజర్వేషన్ చేసుకొంటారు. దీంతో ఇటీవల కాలంలో రిజర్వేషన్ దొరకడం గగనమైంది. నెల్లూరు మీదుగా రాకపోకలు సాగించే వివిధ ఎక్స్‌ప్రెస్ రైళ్లలో రిజర్వేషన్ ఎప్పుడో ఫుల్ అయిపోయింది. జూలై నెల వరకు రిజర్వేషన్ లేదని రైల్వే సిబ్బంది చెప్తుండడాన్ని చూస్తే ఏడాదికేడాది వేసవిలో

### జూలై వరకు రిజర్వేషన్లు లేవు

రైళ్లలో ప్రయాణించేవారి సంఖ్య అధికమవుతుందన్న సంగతి తెలుస్తుంది. పిల్లల సెలవులు, ఇతరత్రా అవసరాలను దృష్టిలో వుంచుకొని ప్రత్యేక రైళ్లను నడపాల్సి వున్నా అవి లేకపోవడంతో వేసవి రద్దీని తట్టుకోవడం కష్టమౌతోంది. చివరకు తాత్కాల్‌లోనూ సీట్లు దొరకని పరిస్థితి. జిల్లా నుంచి బయలుదేరే ఒక్క సింహపురి ఎక్స్‌ప్రెస్ రైలుకు మాత్రమే కొంతమేర సీట్లు దొరుకుతున్నాయి. ప్రయాణీకుల సంఖ్యను, రద్దీని దృష్టిలో వుంచుకొనైనా అధికారులు ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయాలని ప్రయాణీకులు కోరుకొంటున్నారు.

## ఎవరి గోల వారిదే!

### కార్పొరేషన్ ఎన్నికలకు ఎన్ని ఫీట్లో... పాట్లో!

ఆలూ లేదు చూలు లేదు కొడుకు పేరు సోమలింగం అన్నచందంగా వుంది మునిసిపల్ ఎన్నికల తీరు. ఈ ఎన్నికలు ఎప్పుడు జరుగుతాయి, అసలు జరుగుతాయా లేదా అన్న సందిగ్ధంలో వుండగా ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థుల జాబితా మాత్రం పెరిగిపోతోంది. ఎన్నికల నిర్వహణకు అధికార యంత్రాంగం అన్ని ఏర్పాట్లు చేస్తుంది. ఓటర్ల జాబితా, బిసి గణన చేపడుతుండగా, మరోవైపు వివిధ పార్టీల తరపున ఈ సారి జరిగే ఎన్నికల్లో పోటీచేసేందుకు పలువురు ఇప్పటి నుంచే అస్త్రశస్త్రాలను సిద్ధం చేసుకొంటున్నారు. అయితే ఈ దఫా ఎన్నికల్లో భారీ మార్పులు చోటుచేసుకోబోతున్నాయి. మొత్తం 50 డివిజన్లలో 50 శాతం డివిజన్లను మహిళలకు కేటాయించాల్సి రావడంతో దాదాపు 25 డివిజన్లు వారికి రిజర్వ్ కానున్నాయి. ఇక మిగిలిన వాటిలో 13 డివిజన్లు బిసిలకు కేటాయించాల్సి వుంది. 12 స్థానాలు మాత్రమే జనరల్ కేటగిరికి రానున్నాయి. ప్రస్తుత తాజా మాజీలతోపాటు క్రొత్తవారు కార్పొరేటర్లుగా పోటీచేసేందుకు ఇప్పటి నుంచే సర్వం సిద్ధం చేసుకొంటున్నారు. అధినేతలను కలసి వారి ఆశీర్వాదం పొందేందుకు తంటాలు పడుతున్నారు. తాజా మాజీలు తమకు లేకపోయినా భార్యలకు మహిళా కోటాలో సీటు ఇప్పించి పెత్తనం సాగించేందుకు రెడీ అవుతున్నారు. గత ఎన్నికలకు భిన్నంగా ఈ ఎన్నికలు వుండనున్నాయి. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఆవిర్భావంతో టిడిపి, కాంగ్రెస్‌ల మధ్య త్రిముఖ పోటీ నెలకొననుంది. ప్రస్తుత రాష్ట్ర రాజకీయ పరిస్థితుల్లో పురపాలక ఎన్నికలు పెడుతారో లేదో స్పెషల్ ఆఫీసర్ల పాలన మరికొంతకాలం కొనసాగనుందనేది తేలాల్సి వుంది.



నెల్లూరు దర్గామిట్టవాసి కొండా రవీంద్రరెడ్డి కుమారుడు శ్రీకాంత్‌రెడ్డి, మౌనికల వివాహం మే 5వ తేది అనిల్ గార్డెన్స్‌లో జరిగింది.

## పెద్దాసుపత్రిలో మందుల కొరత

జిల్లాలో ప్రభుత్వ ఆస్పత్రులను మందుల కొరత పట్టిపీడిస్తుంది. ప్రభుత్వం నుంచి రావాల్సిన నిధులు సకాలంలో అందకపోవడంతో ఆ ప్రభావం రోగులపై పడుతోంది. చివరకు జ్వరానికి ఇచ్చే మాత్రలు ఆస్పత్రుల్లో దొరకని పరిస్థితి ఏర్పడింది. గత ఏడాది వార్షిక బడ్జెట్‌లో ఆస్పత్రులకు కేటాయించిన నిధులు గత ఆరు నెలలుగా విడుదలకాకపోవడంతో ఆస్పత్రులకు జబ్బు చేసింది. ప్రతి సంవత్సరం నాలుగు విడతలుగా ప్రభుత్వం మందులకు బడ్జెట్ విడుదల చేస్తుంది. గత ఏడాదికి సంబంధించిన నాలుగో విడత నిధులు ఇంతవరకు అందకపోవడంతో ఆస్పత్రుల్లో మందుల కొరత ఏర్పడింది. నెల్లూరు పెద్దాసుపత్రి, కావలి, గూడూరు ఏరియా వైద్యశాలలకు కలిపి దాదాపు 20 లక్షల రూపాయలకు పైగా మందుల కొనుగోలుకు విడుదల కావాల్సి వుంది. ఈ మొత్తం రాకపోవడంతో ప్రభుత్వ ఆస్పత్రుల్లో కట్టుకట్టే బ్యాండేజి క్లాత్ సైతం లేకుండా పోయింది. ఆస్పత్రికి వచ్చే రోగులనే మందులు, బ్యాండేజి క్లాత్ కొనుక్కొనిరమ్మని చెప్తుండడంతో పేద ప్రజలు అల్లాడి పోతున్నారు. కొన్నిచోట్ల పాత చీరలు చింపి కట్టుకడుతున్నారు. సిరంజిలు, సర్జికల్ గ్లౌజులు, పారాసిటిమాల్ మాత్రలు లేవు. నేషనల్ రూరల్ హెల్త్ మెయింట్‌నెన్స్(ఎన్ఆర్‌హెచ్ఎం) క్రింద రెండు సంవత్సరాల నుంచి రావాల్సిన 20 లక్షల రూపాయల నిధులు రాకపోవడంతో మందులు బయటకొనక తప్పడం లేదు.




పేరుకే పెద్దాసుపత్రి.



చెర్లో శేషారెడ్డి కుమారుడు ప్రదీప్, వెన్నెలల వివాహం మే 22వ తేది నెల్లూరు అనిల్ గార్డెన్స్‌లో జరిగింది.

## పోలింగ్ స్టేషన్లపై సమీక్ష

జిల్లాలో నూతనంగా ఏర్పాటు చేయనున్న పోలింగ్ స్టేషన్ల వివరాలపై 29వ తేది కేంద్రాల్లో సమీక్ష సమావేశం నిర్వహించారు. జిల్లా స్థాయిలో జిల్లా కలెక్టర్, మండలస్థాయిలో మండల పరిషత్ అభివృద్ధి అధికారి సమీక్ష నిర్వహించారు. ఈ సమీక్షా సమావేశంలో గుర్తింపు పొందిన రాజకీయ పార్టీల ప్రతినిధుల్ని ఆహ్వానించడం జరిగింది. త్వరలో జరుగనున్న స్థానిక సంస్థల ఎన్నికలను దృష్టిలో వుంచుకొని రెవిన్యూ సిబ్బంది ఓటరు జాబితాను రూపొందించారు. ఓటరు జాబితాలో అనేక మంది పేర్లు ఈ దఫా కూడా గల్లంతైనాయి. జాబితాలో వున్న పేర్లు కూడా తప్పులతడికగా వున్నాయి. పలు దఫాలు మార్పుచేర్పుల కోసం దరఖాస్తు సమర్పించినా సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరించి సరి చేయకుండా మానేశారు. ఇదే విషయంపై సమీక్ష సమావేశానికి హాజరైన పలు రాజకీయ పార్టీల ప్రతినిధులు అభ్యంతరం వ్యక్తంచేస్తూ అధికారులకు ఫిర్యాదు చేశారు.



పదవ తరగతి పరీక్షలో స్టేట్ ర్యాంకులు సాధించిన నెల్లూరు రాఘవ స్కూల్ విద్యార్థులు స్వర్ణశ్రీ, మనోజ్‌కుమార్‌లను అభినందిస్తున్న ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. ప్రక్కన స్కూల్ అధినేత దశరధరామయ్య.

# బ్యూటీపార్లర్ల మాటున అసాంఘిక కార్యక్రమాలు?

**నెల్లూరు, కావలి, ఆత్మకూరు, గూడూరు, నాయుడుపేటలలో బ్యూటీ పార్లర్ల ముసుగులో వ్యభిచారం జరుగుతుందనే విషయమై ఎస్పీకి అధిక సంఖ్యలో ఫిర్యాదులు వెళ్లడంతో వీటిపై నిఘా వుంచాలని ఆదేశాలు జారీ అయ్యాయి.**

జిల్లాలోని పలు పట్టణాల్లో నిర్వహిస్తున్న బ్యూటీపార్లర్లపై పోలీసులు నిఘా వుంచారు. బ్యూటీపార్లర్ పేరుతో అందమైన యువతులను వ్యభిచారంలోకి దింపుతున్నారన్న ఆరోపణలున్నాయి. గతంలో కూడా నెల్లూరు నగరంలో బ్యూటీ పార్లర్ మాటున వ్యభిచార గృహాన్ని నిర్వహిస్తున్న వారిని పోలీసులు అరెస్టు చేయగలిగారు. అయినప్పటికి బ్యూటీపార్లర్లు అధికసంఖ్యలో ఏర్పాటయ్యి అభం శుభం తెలియని యువతులు, వివాహితులు ఈ ఉచ్చులో తెలియకుండానే ఇరుక్కుంటున్నారు.

## తేలిక సెక్షన్లతో కేసులు!

బ్యూటీపార్లర్ పేరుతో లోపల వ్యభిచారం చేయించే నిర్వాహకులపై కఠిన శిక్షపడే సెక్షన్‌లపై కేసులు నమోదు చేయకపోవడంతో జరిమానా చెల్లించి సులభంగా బయటపడుతున్నారు. ఆ తర్వాత మరో ప్రాంతంలో వేరే పేరుతో బ్యూటీపార్లర్ ఏర్పాటుచేసి యధాతథంగా ఈ వృత్తిని కొనసాగిస్తున్నారు. నెల్లూరు నగరంతోపాటు కావలి, ఆత్మకూరు, గూడూరు, నాయుడుపేట తదితర ప్రాంతాల్లో బ్యూటీ పార్లర్ల మాటున వ్యభిచారం గుట్టుచప్పుడు కాకుండా జరిగిపోతోంది. బ్యూటీపార్లర్ నిర్వాహకులకు ఏదో ఒక రాజకీయ పార్టీతో సన్నిహిత సంబంధాలు వుంటున్నాయి. పోలీసుల తనిఖీల్లో పట్టుబడిన వెంటనే రాజకీయ పార్టీ నేతల నుండి పోలీస్ స్టేషన్‌కు ఫోన్లు వెల్లువెత్తడం జరుగుతుంది.

## ఆర్థిక ఇబ్బందులే కారణం

ఆర్థిక ఇబ్బందుల కారణంగా అనేక మంది యువతులు వ్యభిచారంలోకి దిగుతున్న సంఘటనలు వున్నాయి. కుటుంబ పోషణ నిమిత్తం చేసిన అప్పులు తీర్చేందుకు వేరే గత్యంతరం లేకపోవడంతో బ్యూటీ పార్లర్లలో నెలసరి జీతానికి కుదిరి ఆతర్వాత నిర్వాహకుల ప్రోద్భలంతో వ్యభిచారంలో దించబడుతున్నారు. ఒకసారి ఇందులోకి దిగితే బయటపడడం కష్టం. ఒకప్రక్క నిర్వాహకుల బెదిరింపులు, మరోప్రక్క పోలీసుల వేధింపులు వెంటాడుతుంటాయి. కుటుంబ పరువు ఎక్కడ బజారున పడుతుందోనని భయపడిపోతుంటారు.

## పెద్ద సంఖ్యలో ఫిర్యాదులు

జిల్లా ఎస్పీకి బ్యూటీపార్లర్ల మాటున సాగే రాసలీలలు గురించి అధిక సంఖ్యలో ఫిర్యాదులు వెళ్లడంతో నగరంతోపాటు అన్ని పోలీస్‌స్టేషన్ల పరిధిలో నిర్వహిస్తున్న బ్యూటీపార్లర్లపై నిఘా వుంచాలని ఆదేశాలు వెళ్లినట్లు తెలిసింది. ఎస్పీ ఆదేశాలతో అప్రమత్తమైన పోలీసులు అనుమానం వచ్చిన పార్లర్‌పై సాధారణ పౌరులుగా వెళ్లి నిఘా వుంచుతున్నారు. జిల్లాలో ఈ తతంగం చాలా సంవత్సరాల నుంచి నడుస్తున్నది. ఏ ఒక్క అధికారి కూడా ఈ వృత్తిని పూర్తి స్థాయిలో నియంత్రించలేకపోతున్నారు.

పోలీస్‌స్టేషన్‌లో జనరల్‌డ్యూటీ నిర్వహించే పోలీసులకు బ్యూటీపార్లర్లలో జరిగే మొత్తం వ్యవహారం గురించి తెలుసు. నిర్వాహకుల నుంచి మామూళ్లు అందుతుండడంతో ఉన్నతాధికారులకు సమాచారం అందించడం లేదన్న విమర్శలు వున్నాయి. ఒకవేళ తనిఖీకి వెళ్లే అవకాశం వుంటే ముందుగా సమాచారం చేరవేసి సహకరిస్తుంటారు. దీంతో నిర్వాహకులు కొన్ని సందర్భాల్లో తప్పించుకోగలుగుతున్నారు. ఇటీవల జిల్లా ఎస్పీ జనరల్ డ్యూటీలను రద్దు చేస్తూ నిర్ణయం తీసుకొన్నారు. ఎస్పీ నిర్ణయంతో పలువురు జి.డి కానిస్టేబుళ్లు ఆదాయం కోల్పోవాల్సి వచ్చింది.

## తగ్గిపోయిన కస్టమర్లు

ప్రస్తుతం బ్యూటీపార్లర్లపై నిఘా వుంచడంతో కస్టమర్ల సంఖ్య బాగా తగ్గిపోయింది. ఈ కేంద్రాలకు వచ్చి వెళ్లేవారి రాకపోకలపై కూడా ఆరాతీస్తున్నారు. విలాసవంతమైన జీవనం గడిపేందుకు అలవాటు పడిన వారిని గుర్తించి నెలసరి కాంట్రాక్టు ఒప్పందం కుదుర్చుకుని బ్యూటీపార్లర్‌కు తీసుకొస్తుంటారు. ఇవే కాకుండా వివిధ ప్రాంతాల్లో పెద్ద భవనాలను అద్దెకు తీసుకొని కూడా కొందరు మహిళలు వ్యభిచార వృత్తిని నిర్వహిస్తున్నారు. నెల్లూరులో హైక్లాస్ వ్యభిచారం మూడు పువ్వులు ఆరు కాయలుగా విరాజిల్లుతోంది. రాజకీయ నాయకులు, అధికారుల సహాయ సహకారాలతో బ్యూటీపార్లర్ల పేరుతో వ్యభిచారం జరగడం దారుణం.

---

# ప్రభుత్వ సొమ్ము ప్రైవేట్ విద్యాసంస్థల పాలు!

> “ప్రైవేటు విద్యాసంస్థలలో చేరగోరే ఆరు, ఏడు తరగతుల ఎస్సీ, ఎస్టీ విద్యార్థుల కోసం ప్రభుత్వం విడుదల చేస్తున్న నిధులు ఒక పథకం ప్రకారం స్వాహా అవుతున్నాయి.”

పేద విద్యార్థుల అభ్యున్నతి కోసం ఖర్చు చేయాల్సిన సొమ్ము ప్రైవేట్ విద్యాసంస్థల నిర్వాహకుల జేబుల్లోకి వెళ్లిపోతోంది. సాంఘిక సంక్షేమశాఖ, గిరిజన సంక్షేమ శాఖ ప్రతి సంవత్సరం లక్షలాది రూపాయల నిధుల్ని ప్రైవేట్ విద్యాసంస్థలకు చెల్లిస్తున్నాయి. ఎస్సీ, ఎస్టీ విద్యార్థులను పేరెన్నికగల పాఠశాలలలో చేర్పిస్తుంటారు. ఇందుకోసం జిల్లావ్యాప్తంగా పోటీ బాగానే వుంటుంది. ఎస్సీ, ఎస్టీ విద్యార్థులకు ప్రభుత్వం నుంచి నిధులు అందుతుండడంతో ప్రవేశం కల్పించేందుకు పలు విద్యాసంస్థలు పోటీపడుతుంటాయి. ప్రభుత్వ పాఠశాలల్లో విద్యనభ్యసించే 6, 7 తరగతుల్లో చేరబోయే బాలబాలికలకు పేరెన్నికగల పాఠశాలల్లో ప్రభుత్వం ప్రవేశం కల్పిస్తుంది.

సాంఘిక సంక్షేమశాఖ, గిరిజన సంక్షేమ శాఖ అధికారులు కూడా ప్రైవేట్ విద్యాసంస్థల నిర్వాహకులతో కుమ్మక్కు అవుతున్నారన్న ఆరోపణలు వున్నాయి. గ్రామీణ ప్రాంతాల విద్యార్థులకు ప్రవేశం కల్పించే విషయం తొలి ప్రాధాన్యత ఇవ్వాల్సి వుండగా, పట్టణ ప్రాంత విద్యార్థులు, ఉద్యోగస్తుల పిల్లలకే ప్రవేశం కల్పిస్తుంటారన్న విమర్శలు లేకపోలేదు. పేరెన్నికగల పాఠశాలల్లో ఎస్సీ, ఎస్టీ బాలబాలికలకు 6,7 తరగతుల్లో ప్రవేశం కల్పించే విషయంపై అసలు ప్రచారమే చేయడం లేదు. ఇందుకు సంబంధిత శాఖ అధికారులు సైతం పెద్దగా కృషి చేస్తున్న దాఖలాలు కనిపించడం లేదు. దీంతో ఏ వుద్దేశంతో ఐతే ప్రభుత్వం శ్రీకారం చుట్టిందో ఆ లక్ష్యం నెరవేరకుండాపోయే ప్రమాదం ఏర్పడింది.

## విద్యాహక్కు చట్టంతో కళ్లెం?

కేంద్రప్రభుత్వం గత విద్యాసంవత్సరం నుంచి ఉచిత నిర్బంధ విద్యాహక్కు చట్టాన్ని అమలు చేయాలని శ్రీకారం చుట్టింది. ఈ చట్టం ప్రకారం ప్రైవేట్ విద్యాసంస్థల్లో 25శాతం రిజర్వేషన్ సౌకర్యం కల్పించాల్సి వుంటుంది. ఇందుకు అవసరమైన అన్ని చర్యలను విద్యాశాఖ ఆధ్వర్యంలో చేపట్టాల్సి వుంటుంది. అధికారుల నిర్లక్ష్యం కారణంగా గత సంవత్సరం విద్యాహక్కు చట్టం అమలుకు నోచుకోలేకపోయింది. ప్రైవేటు విద్యాసంస్థల్లో 25శాతం సీట్లను కేటాయించాల్సి వుండగా ఆదిశగా ఏ ఒక్క అధికారి కూడా దృష్టి సారించలేకపోయారు.

ప్రైవేటు విద్యాసంస్థల్లో రిజర్వేషన్ కల్పించే విషయాన్ని గాలికొదిలేసి ఎస్సీ, ఎస్టీ విద్యార్థులలో కొద్దిమందికి మాత్రమే ప్రవేశం కల్పించి లక్షలాది రూపాయలు ఫీజుల రూపంలో అందజేస్తున్నారు. ఈ విద్యాసంవత్సరం కూడా ఇదే తరహాలో ఎస్సీ, ఎస్టీ విద్యార్థులకు ప్రవేశం కల్పించేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం కూడా నిధులు కేటాయిస్తుందే తప్ప విద్యాహక్కు చట్టం అమలు ద్వారా ప్రైవేట్ విద్యాసంస్థల్లో నిబంధనల ప్రకారం దక్కాల్సిన రిజర్వేషన్ గురించి ఆలోచించడం లేదు. పేరెన్నికగల పాఠశాలలకు విడుదల చేస్తున్న నిధులు ప్రభుత్వ పాఠశాలల అభివృద్ధికి ఖర్చు చేయాలని ఉపాధ్యాయ సంఘాలు కోరుతున్నాయి.

ఈ విద్యా సంవత్సరం విద్యాహక్కు చట్టాన్ని పటిష్టంగా అమలు చేస్తామని విద్యాశాఖాధికారులు ప్రకటిస్తుండగా మరోప్రక్క గిరిజన సంక్షేమశాఖ, సాంఘిక సంక్షేమశాఖ అధికారులు మాత్రం విద్యాహక్కు చట్టంతో ఏమాత్రం సంబంధం లేదన్న విధంగా వ్యవహరిస్తూపోతున్నారు. ప్రభుత్వ నిధులు ప్రైవేటు విద్యాసంస్థల పరం కాకుండా చూడాల్సిన బాధ్యత అన్ని శాఖల అధికారులపై వుంది.





పదవ తరగతి పరీక్షా ఫలితాలలో 586 మార్కులు సాధించి స్టేట్ 8వ ర్యాంకు సాధించిన నెల్లూరు రామలింగాపురం శ్రీసాయి విద్యానికేతన్ స్కూల్ విద్యార్థి పి.జితేంద్రతోపాటు అత్యధిక మార్కులు వచ్చిన స్కూలు విద్యార్థులు.





పదవ తరగతి పరీక్షా ఫలితాలలో 573 మార్కులు సాధించి స్కూల్ టాపర్‌గా నిలిచిన యన్.పవనీశ్వరకుమార్‌ను అభినందిస్తున్న వేదవ్యాస హైస్కూల్ కరస్పాండెంట్ ఎపి.బాలాజి, డైరెక్టర్ ఎపి.వేదగిరి.



ఎన్టీఆర్ జయంతిని పురస్కరించుకొని నెల్లూరు వాత్సల్య అనాథ శరణాలయంలోని పిల్లలకు పుస్తకాలు, జామెట్రీ బాక్సులు పంపిణీ చేస్తున్న కాకతీయ సేవాసమితి అధ్యక్షులు రావి మోహన్‌చౌదరి, కార్యదర్శి అంకయ్య చౌదరి, కోశాధికారి లక్ష్మయ్య నాయుడు.



నెల్లూరు కైజన్ హైట్స్‌లో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్లినిక్ రీసెర్చ్ మేనేజ్‌మెంట్ సంస్థ బ్రాంచ్‌ను ప్రారంభిస్తున్న రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి. ప్రక్కన నెల్లూరులో ఆ సంస్థ నిర్వాహకుడు డాక్టర్ ఐ.అనిల్‌కుమార్ రెడ్డి

# దురాక్రమణల పర్వం!

నాయుడుపేట పంచాయితీలో స్థలాల దురాక్రమణ ఇటీవల కాలంలో అధికమయ్యింది. ఖాళీ స్థలాలు కన్పిస్తేచాలు ఆక్రమించేస్తున్నారు. భూముల ధరలకు రెక్కలు రావడంతో స్థలాలకు గిరాకి పెరిగి ఆక్రమణదారులు భూకబ్జాలకు పాల్పడడం ఎక్కువయ్యింది. చివరకు కాలువలను సైతం ఆక్రమించి నిర్మాణాలు చేపడుతున్నారు. ఆర్టీసి

## ప్రభుత్వ స్థలం కనపడితే పాగా!

బస్టాండ్ వద్ద మురుగునీటి కాలువలను ఆక్రమించి ఏకంగా కట్టడాలు మొదలు పెట్టడంతో మురుగునీరుపోయే మార్గం లేక నీరంతా బస్టాండ్ ఆవరణలోకి చేరుతోంది. దీంతో ఆ ప్రాంతమంతా దుర్గంధం వెదజల్లుతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. బహిరంగంగా కాలువలు, స్థలాలను ఆక్రమించి నిర్మాణాలు చేపడుతున్నా సంబంధితశాఖ అధికారులు పట్టీపట్టనట్లు వ్యవహరిస్తుండడంతో రోజు రోజుకు దురాక్రమణదారులు రెచ్చిపోతున్నారు.

# బోగోలులో మంచి డాక్టర్!

## వృత్తితోపాటు సామాజిక సేవ

తండ్రి ఆశయాలకు అనుగుణంగా ఆయన చూపిన బాటలో నడుస్తూ పలువురికి సహాయపడుతున్నాడు బోగోలుకు చెందిన డాక్టర్ సాగర్. స్థానికంగా వైద్యశాల నిర్వహిస్తున్న ఆయన తండ్రి డాక్టర్ రాఘవేంద్ర ఆర్మీలో పనిచేసి మరణించాడు. తండ్రి చూపించిన సేవామార్గాన్ని అనుసరిస్తూ ప్రజలకు తనవంతు సహాయ సహకారాలు అందిస్తున్నాడు డాక్టర్ సాగర్. ఈ ప్రాంత ప్రజల కోసం శవపేటికను సొంత నిధులతో ఏర్పాటు చేసిన ఆయన వేలాది రూపాయలు ఖర్చు చేసి క్రీడామైదానాన్ని కూడా నిర్మించారు. అంతేకాకుండా ప్రయాణీకుల సౌకర్యం కోసం 40వేల రూపాయలు ఖర్చుపెట్టి బస్‌షెల్టర్ నిర్మించారు. గతంలో పలువురు నేతలు బస్‌షెల్టర్ నిర్మిస్తామని ఇచ్చిన హామీలు నెరవేరకుండా పోయిన తరుణంలో ప్రయాణీకుల కోసం సొంతడబ్బుతో షెల్టర్ కట్టించి తన దాతృత్వాన్ని చాటుకొన్నారు. ఇటీవలే ఈ బస్ షెల్టర్‌ను స్థానిక సర్పంచ్ అంకులయ్య ప్రారంభించారు.

# రైతులకు గిట్టుబాటు ధర!

రానున్న రోజుల్లో పొదుపు మహిళలచే ధాన్యం కొనుగోలు కేంద్రాలను ఏర్పాటుచేసి వాటి ద్వారా రైతులు పండించిన పంటకు గిట్టుబాటు ధర కల్పించ చేస్తామని జిల్లా కలెక్టర్ శ్రీధర్ వెల్లడించారు. వెంకటగిరిలో పర్యటించిన ఆయన అధికారులతో వివిధ అంశాలపై సమీక్ష జరిపారు. కరీంనగర్, నల్గొండ, గోదావరి జిల్లాలలో ఇప్పటికే పొదుపు మహిళా సంఘాలచే ధాన్యం కొనుగోలు కేంద్రాలను ఏర్పాటు చేశారన్నారు. త్వరలో ఈ విధానాన్ని జిల్లాలోనూ చేపడుతామన్నారు. అందుకోసం మహిళలకు తగిన శిక్షణనిస్తామన్నారు. జిల్లాలో అన్ని మండలాల్లో పర్యటించి వ్యవసాయం, మద్దతు ధర, పొదుపు సంఘాల పనితీరు, త్రాగునీటి సమస్య, ఉపాధిహామీ వంటి పథకాలపై సమీక్షిస్తున్నట్లు వివరించారు. అధికారులు ప్రభుత్వ పథకాలను అమలు చేయడంలో

## కలెక్టర్ హామీ

చిత్తశుద్ధిగా వ్యవహరించాలన్నారు. ఈ పర్యటనలో భాగంగా బాలాయపల్లి ప్రజలు కుందకూరు వద్ద క్వారీ త్రవ్వకాల వలన ఇళ్లు దెబ్బతింటున్నాయని తెలిపారు. డక్కిలి గ్రామస్తులు ఇళ్ల స్థలాలు కేటాయించాలని కోరారు.

# చెరువుల మరమ్మత్తులు!

చిన్న నీటి వనరులకు ప్రాధాన్యతల్లో భాగంగా 35కోట్ల రూపాయలతో చెరువుల మరమ్మత్తు పనులు చేపట్టనున్నట్లు కావలి నీటి పారుదలశాఖ ఇఇ అనిల్‌రెడ్డి చెప్పారు. గత కొన్నేళ్లుగా చెరువు మరమ్మత్తులకు నోచుకోకపోవడంతో ఆయకట్టు రైతాంగానికి సాగు నీరందక పంటల సాగుకు ఇబ్బందులు ఏర్పడ్డాయన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని ప్రభుత్వం ఆర్ఆర్ పథకం క్రింద నాబార్డు నిధులను కేటాయించిందన్నారు. ఈ నిధులతో డివిజన్ పరిధిలో 117 చెరువులకు అంచనాలు సిద్ధం చేసి ప్రభుత్వానికి నివేదించామన్నారు. దాదాపు 100 చెరువులకు ఈ నిధులతో మరమ్మత్తులు చేపట్టేందుకు అవకాశం ఏర్పడిందన్నారు. కావలి చెరువు, వరవకాలువకు 2.5కోట్లతో పనులు జరుగుతున్నాయన్నారు. సాగునీటి కాలువ కోసం కోటి నలభై లక్షల రూపాయలు మంజూరయ్యాయన్నారు.

# జగన్ పార్టీపై రాజ్యలక్ష్మి ఆరా!

## కొత్తపార్టీ సంగతి చెప్పమన్న మాజీ మంత్రి

మాజీ మంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మి వైఎస్ జగన్ స్థాపించిన వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ గురించి ఆరా తీశారు. ఇటీవల వెంకటగిరి వచ్చిన ఆమె తన నివాసంలో కార్యకర్తల సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా పలు గ్రామాల ప్రజలు త్రాగునీటి సమస్య, భూవివాదాలు, అంగన్‌వాడీ పోస్టుల భర్తీ తదితర అంశాలపై ఆమెతో చర్చించారు. రాజ్యలక్ష్మి స్పందిస్తూ ఎప్పుడూ వినతి పత్రాలు ఇవ్వడమేనా క్రొత్తపార్టీ పరిస్థితి చెప్పరా అంటూ వ్యాఖ్యానించారు. ఆ పార్టీ బలాబలాలపై కార్యకర్తలతో కూలంకషంగా మాట్లాడిన ఆమె కాంగ్రెస్ పార్టీని బలోపేతం చేసేందుకు కలసికట్టుగా పని చేద్దామని అందుకోసమే తానిక్కడికి వచ్చానన్నారు. ఈ సందర్భంగా కాశీకి వెళ్లి అలహాబాద్ ప్రమాదంలో మృతి చెందిన కుటుంబాలకు తన సంతాపాన్ని వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమంలో పెంచలకోన ఆలయ పాలకమండలి అధ్యక్షులు రవీంద్రరెడ్డి, స్థానిక మండలాధ్యక్షుడు దట్టం సుబ్బయ్య, డక్కిలి మండలాధ్యక్షుడు చెంచయ్య, జడ్పీటిసి సభ్యుడు రామచంద్రయ్య, బాలాయపల్లి కాంగ్రెస్‌నేత మధురెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# బావి కాదు మృత్యుకుహరం

## బోగోలు బావి కథాకమామిషు

ప్రజల మంచినీటి అవసరాల కోసం త్రవ్విన బావి వారి ప్రాణాలను హరించేదిగా మారడంతో బోగోలు గ్రామస్తులు హడలిపోతున్నారు. మంచి నీటి సంగతి అటుంచితే ప్రమాదాలకు నిలయంగా మారడంతో దాని పేరు చెప్తేనే గ్రామస్తులు హడలిపోతున్నారు. నేలమట్టానికి 3 అడుగుల ఎత్తులో వుండడంతో వర్షాలు కురిసినపుడు నీటితో బావి నిండిపోతుంది. ఈ పరిస్థితుల్లో ఎక్కడ బావి వుందో తెలియకపోతుండడంతో పలువురు బావిలోపడి ప్రాణాలు కోల్పోయారు. దీనికితోడు పలువురు ఆత్మహత్యలు చేసుకొనేందుకు ఈ బావిలో దూకి ప్రాణాలు పొగొట్టుకొన్న ఘటనలు అనేకం వున్నాయి. ఈ బావి కారణంగా ఇప్పటి వరకు 15మంది దుర్మరణం పాలయ్యారని గ్రామస్తులు చెప్తున్నారు. ఈ ప్రమాదాలను దృష్టిలో వుంచుకొనైనా అధికారులు బావిపై తగిన రక్షణ చర్యలు చేపట్టాలని వారు కోరుకొంటున్నారు.

● కావలిలో

## సక్రమంగా తిరగని ఆర్టీసి బస్సులు!

కావలి డివిజన్‌లో వివిధ ప్రాంతాల్లో ఆర్‌టిసి బస్సులు సక్రమంగా తిరగకపోవడంతో ప్రయాణీకులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దూర ప్రాంతాలకు పోవాలంటే బస్సులురాక, ఎప్పుడు సర్వీసులు రద్దవుతాయో తెలియక వారు పడుతున్న అగచాట్లు అన్ని ఇన్ని కావు. అల్లూరు, దగదర్తి, బోగోలు మండలాల ప్రజలు తిరుపతి వంటి ప్రాంతాలకు పోవాలంటే బస్సులు లేకపోవడంతో అవస్థలు పడాల్సి వస్తోంది. మద్రాస్ పోవాలన్నా ఇదే పరిస్థితి.

### ఆర్టీసి డిపోకు ఇదేం రోగం?

ఈ ప్రాంతాలకు పోవాలంటే మండలాల్లోని ప్రయాణీకులు రెండు, మూడు బస్సులు మారాల్సి వస్తోందని వాపోతున్నారు. ఆర్‌టిసి అధికారులకు బస్సులు నడపాలని పలుమార్లు విజ్ఞప్తి చేసినా పట్టించుకోవడం లేదని ఆరోపిస్తున్నారు. ఇక వింజమూరు నుంచి కావలి వచ్చే ప్రయాణీకులది మరో సమస్య. పోలంపాడు, కలిగిరి నుంచి వచ్చేటప్పుడు రోడ్లు మరీ అధ్వాన్నంగా తయారు కావడంతో ఒళ్లు హూనం అవుతోందట. అసలే సింగిల్‌రోడ్డు, దీనికి తోడు గుంటలు మిట్టలుగా వుండడంతో ఈ మార్గం గుండా ప్రయాణం చేయాలంటేనే నరకం కనిపిస్తోందని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు ప్రయాణీకులు.

## మిర్చి రైతుల్లో ఆందోళన!

మంచి ధర వున్నప్పటికీ దిగుబడి తగ్గడంతో మిర్చిరైతుల్లో ఆందోళన వ్యక్తమౌతోంది. గత ఏడాదితో పోల్చితే దిగుబడి సగానికి సగం తగ్గిపోయింది. ధర మాత్రం రెట్టింపయింది. దీంతో రైతులు ఆవేదన చెందుతున్నారు. వాతావరణంలో మార్పులు, అకాల వర్షం తదితర కారణాలతో దిగుబడి పూర్తిగా తగ్గిపోయింది. కొండాపురం మండలంలోని సాయిపేట, నేకునాంపేట, పార్లపల్లి, తూర్పుఎర్రబల్లి, ఉప్పులూరు, గొట్టిగొండాల తదితర గ్రామాల్లో అధికంగా మిర్చిసాగు చేశారు రైతులు. కూలీలు, ఎరువులు, పురుగు మందులు కలిపి ఎకరాకు షుమారు లక్షరూపాయల వరకు పెట్టుబడి

### రేటు పెరిగింది - దిగుబడి తగ్గింది

పెట్టాల్సి వచ్చింది. దీనికి తోడు స్థానికంగా మార్కెట్‌యార్డు లేకపోవడంతో క్వింటాల్‌కు అదనంగా మరో వెయ్యిరూపాయలు భారం పడుతోంది. ఈ పరిస్థితుల్లో పంట సాగు చేసే సమయంలో ఏపుగా పెరిగిన మిర్చి అకాల వర్షం దెబ్బకు దిగుబడిపై ప్రభావం చూపింది. కాయల్లో నాణ్యత లోపించి తెల్లకాయలు అధికంగా వచ్చాయి. గత ఏడాది ఎకరానికి 35 నుంచి 40 క్వింటాళ్ల దిగుబడి రాగా ఈ ఏడాది ఎకరాకు 15 క్వింటాళ్లు మాత్రమే దిగుబడి రావడంతో ధర బాగానే వున్నా ఫలితం లేకుండా పోయిందని మిర్చి రైతులు వాపోతున్నారు.



# పొగాకు రైతులకు బాసట!

భారత పొగాకు బోర్డు ఛైర్మన్ జి.కమలవర్ధన్ జిల్లాలో వివిధ ప్రాంతాల్లో పర్యటించి రైతులకు భరోసా ఇచ్చారు. డిసిపల్లి, మర్రిపాడు, కలిగిరి మండలాల్లో పర్యటించిన ఆయన పొగాకు రైతులతో వారి స్థితిగతులపై ఆరా తీశారు. రైతుల సమస్యలను అడిగి తెలుసుకొన్న ఆయన వారికి అండగా వుంటామని హామీ ఇచ్చారు. పొగాకు బోర్డు వేలం కేంద్రాలను పరిశీలించిన ఆయన మాట్లాడుతూ వేలంలో సీలింగ్ విధానం లేకుండా చేసి అధిక ధరలు వచ్చేందుకు అవకాశం కల్పించామన్నారు. వర్షాల వలన నష్టపోయిన రైతులకు తగిన పరిహారం అందజేస్తామన్నారు. ప్రక్క రాష్ట్రమైన కర్నాటకలోనూ రైతులకు గిట్టుబాటు ధర బాగుందన్నారు. వాణిజ్య పంటల ధరలు విదేశీ మార్కెట్ ఎగుమతులపై ఆధారపడి వుంటాయన్న ఆయన బ్రెజిల్, జింబాబ్వే దేశాల్లో ఈ ఏడాది అధి

### డిసిపల్లిలో పొగాకు బోర్డు ఛైర్మన్

కంగా పొగాకు సాగు చేశారన్నారు. దీని ప్రభావం రైతులపై వుంటుందని చెప్పారు. పొగాకు కొనుగోలు కేంద్రాలతో చర్చించి రైతులు నష్టపోకుండా చూస్తామని హామీ ఇచ్చారు. రైతు సంఘం నాయకులు గాలి నరసప్పనాయుడు, బాల వెంగళరెడ్డి, చాగంటి జయరామిరెడ్డి, రావూరి శ్రీకాంత్‌బాబు, వెంగయ్య తదితరులు పొగాకు రైతులు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను ఛైర్మన్ దృష్టికి తీసుకొని వచ్చారు. ముందుగా చెప్పకుండా పర్యటించడం పట్ల వారు అభ్యంతరం వ్యక్తం చేశారు. ఛైర్మన్‌తోపాటు బోర్డు రీజినల్ మేనేజర్ కన్నయ్య, వేలం నిర్వహణాధికారి ఉమామహేశ్వరరావు, ఐటిసి మార్కెటింగ్ మేనేజర్ రాజశేఖర్ పాల్గొన్నారు.

## కిరణ్‌పై ఆనం సన్నాయి నొక్కులు



మొన్నటిదాకా బాగానే వున్నారు కదా! ఇప్పుడేమైంది! ఇద్దరి మధ్య ఎందుకు బెడిసింది. మంత్రుల్లో ఈ మధ్యయిదే హాట్‌టాపిక్‌గా మారింది. రామనారాయణపై మోజుపడి కిరణ్ ఆర్థిక మంత్రి పదవిని కట్టబెట్టాడు. అంతేకాదు మంత్రివర్గంలో నెంబర్ టూ నారాయణే అన్న బిల్డప్ కూడా ఇచ్చాడు. నారాయణతో బాగా వున్నానని తెలియటానికి నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డికి కటీఫ్ కూడా చెప్పాడు. అయితే ఏమైందో ఏమోకానీ కొన్ని రోజులుగా నారాయణ పేరు చెబితేచాలు కిరణ్ రుసరుసలాడుతున్నాడట. సిఎంలో ఈ మార్పు ఎందుకొచ్చిం దబ్బా! అంటూ సాటి మంత్రులు ఆరా తీశారట. ఆ మధ్య పార్టీ పరిశీలకుడు గులామ్ నబీ ఆజాద్ హైదరాబాదుకు వచ్చినప్పుడు సిఎంను మార్చుతారన్న వార్తలు గుప్పుమన్నాయి. కిరణ్‌కు సన్నిహితుడిగా ముద్ర వున్న రామనారాయణ కూడా కిరణ్ వ్యవహారశైలిపై ఆజాద్‌కు ఫిర్యాదు చేశాడట. ఒక వేళ సిఎంను మార్చే ఆలోచన వున్నట్లయితే మంత్రివర్గంలో సీనియర్ అయిన తన పేరును గుర్తుపెట్టుకోమంటూ ఆజాద్‌ను కోరాడట. ఈ విషయం కాస్తా వేగుల ద్వారా కిరణ్ చెవిన పడింది. రోశయ్యను మార్చే సమయంలో కూడా రామనారాయణ ఢిల్లీకి వెళ్లి పెద్ద పైరవీయే చేశాడు. తిరిగి తన విషయంలో కూడా నారాయణ అలాగే వ్యవహరించడంతో కిరణ్ మనసు కష్టబెట్టుకున్నాడట. మంత్రివర్గంలో తాను బాగా నమ్మిన నారాయణే తనకు ఎసరు పెట్టడంతో కిరణ్ ఖంగుతిన్నాడట. ఇక అప్పటినుండి నారాయణను దూరంగా పెడుతున్నట్లు చెబుతున్నారు. సిఎం వైఖరిలో వచ్చిన మార్పుపై రామనారాయణ కూడా రుసరుసలాడుతున్నాడట. తనకు సన్నిహితులైన మంత్రుల దగ్గర సిఎంపై సన్నాయి నొక్కులు కూడా నొక్కుతున్నాడట. నీవు నేర్పిన విద్యయే కదా రామనారాయణ.

## మారిన మనిషి 'బాబు'



చంద్రబాబు మారిపోయాడు... మాట తీరే కాదు... వేషం కూడా మార్చాడు. మహానాడు చివరి రోజు బుద్ధిగా అడ్డపంచె కట్టుకొని దర్శనమిచ్చాడు. గతంలో తాను చేసిన తప్పుల దండ కాన్ని వల్లెవేసి చెంపలు కూడా వేసుకున్నాడు. బిజెపితో స్నేహం చేయడం తప్పే నంటూ గుంజిళ్లు కూడా తీశాడు. ఇకపై తాను మారిన మనిషంటూ ఒకటికి పదిసార్లు చెప్పుకున్నాడు. ఇదే విషయాన్ని ఫ్రంట్ పేజీలో ప్రచురించమని పత్రికలవారిని కూడా వేడుకున్నాడు. అయితే చంద్రబాబు హడావుడిని చూసి తెలుగు తమ్ముళ్ల పరేశాన్ అయ్యారట. ఇంతసీన్ అవసరమా! అంటూ చెవులు కొరుక్కున్నారట. కాగా తొలిరోజు మహానాడులో పుత్రరత్నం లోకేష్ ఫ్లెక్సీలు చూసి లోలోపల సంతోషపడిన చంద్రబాబుకు హరికృష్ణ షాక్ ఇచ్చాడు. ఏమనుకున్నాడో ఏమోగానీ మరుసటి రోజుకల్లా లోకేష్ ఫ్లెక్సీలు తీయించేశాడు. పనిలో పనిగా బాలకృష్ణ, హరికృష్ణ ఫోటోలతో ఫ్లెక్సీలు పెట్టించాడు. రాజకీయాలు వేరు... రక్తసంబంధం వేరు అంటూ స్టేట్‌మెంట్ కూడా ఇచ్చాడు. మొత్తానికి మూడు రోజుల మహానాడులో తాను పూర్తిగా మారిన మనిషన్న బిల్డప్ ఇచ్చాడు. అయితే సన్నిహితంగా చూస్తున్న వారు మాత్రం బాబు మారాడంటే నమ్మడం లేదు. వేషభాషలు మార్చినా... మనసు మాత్రం మారకపోతే ఎలా! బాబుగారు!!

## మార్కెటింగ్ శాఖ మొద్దునిద్ర




మద్దతు ధర లేక... ధాన్యాన్ని కొనే నాథుడు లేక రైతాంగం గగ్గోలు పెడుతోంటే వ్యవసాయ మార్కెటింగ్‌శాఖ మాత్రం మొద్దునిద్ర పోతుంది. రాష్ట్రవ్యాప్తంగా 327 వ్యవసాయ మార్కెట్ కమిటీలున్నా రైతు సంక్షేమాన్ని ఏమాత్రం పట్టించుకోకుండా మార్కెటింగ్‌శాఖ అధికారులు చోద్యం చూస్తున్నారు. ధాన్యం అమ్ముకోవడానికి మార్కెట్ యార్డుకు వస్తున్న రైతుల్ని వ్యాపారులు నిలువు దోపిడీ చేస్తున్నారు. దిక్కుమొక్కులేక రైతులు తమ కష్టార్జితాన్ని అయినకాడికి అమ్ముకోవాల్సిన దుస్థితి ఏర్పడింది. అయినా మార్కెటింగ్‌శాఖాధికారులకు చీమకుట్టినట్లయినా లేదు. రాష్ట్రంలో రైతులు కష్టాలతో విలవిల్లాడుతుంటే మార్కెటింగ్‌శాఖ కమిషనర్ సుకుమార్ మాత్రం విలాసాల్లో మునిగి తేలుతున్నాడు. రైతుల బాధల్ని ప్రక్కనపెట్టి ఓ వారం రోజులపాటు కాశ్మీర్ అందాల్ని తిలకించడానికి వెళ్లాడు. పనిలో పనిగా అటు నుండి జైపూర్‌కు కూడా వెళ్లి వస్తాడట. క్రొత్త ఇంటి నిర్మాణానికి జైపూర్ నుంచి చలవరాతిని తెచ్చుకోవడానికి కమిషనర్ సుకుమార్ చూపుతున్న శ్రద్ధ రైతాంగం మీద లేకపోవడాన్ని సాటి ఐఎఎస్‌లే విమర్శిస్తున్నారు.




## సిఎం మారేనా!




సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి మారిపోయాడా! అవును... నేను మారిపోయాను. అంటూ సాక్షాత్తు కిరణే చెబుతుంటే మనం నమ్మకపోతే ఎలా? అయితే కిరణ్‌కు దగ్గరగా మసలుతున్నవారు మాత్రం కిరణ్ వ్యవహారశైలిలో ఏమాత్రం మార్పు లేదనే అంటున్నారు. గుంభనంగా వుండటం, కీలక నిర్ణయాల్ని సైతం ఎవరితో చర్చించకపోవడం, ఫైళ్ల క్లియరెన్స్ తదితర విషయాల్లో కిరణ్ వైఖరి మునుపటి లాగే వుందట. వివిధ శాఖల సమీక్షా సమావేశాల్లో కూడా అధికారులు చెబుతుంటే వారించడం, అడ్డు పడటం షరా మామూలుగానే వుందన్నది అభిజ్ఞ వర్గాల ఉవాచ. కాగా సిఎం వ్యవహారశైలిపై అధిష్టానానికి కుప్పతెప్పలుగా ఫిర్యాదులందుతున్నాయి. మంత్రివర్గంలోని వారే ఫిర్యాదులు చేయడం జరుగుతోంది. కాగా ఏమీ పట్టించుకోని నేదురుమల్లి జనార్ధనరెడ్డి కూడా పనిగట్టుకొని అధినేత్రి దగ్గరకు వెళ్లి సిఎం కిరణ్ వైఖరిపై ఫిర్యాదు చేయడం కాంగ్రెస్ వర్గాల్లో 'సెగ' పుట్టించింది. దీంతో అసమ్మతీయు లంతా కిరణ్ వ్యతిరేక మ్యూజిక్ వినిపించడానికి గొంతు సవరించుకుంటున్నారట! వింటున్నారా! కిరణ్... మీరు మారానంటే సరిపోదు... మారినట్లు సహచరులకు నమ్మకం కలిగించాలి.

## మొక్కు తీర్చుకున్న ముఖ్యమంత్రి



ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి శ్రీవారి మొక్కుతీర్చుకున్నారు. తలనీలాలు సమర్పించుకొని స్వామి వారికి కృతజ్ఞతలు తెలిపారు. ఆ మధ్య పార్టీ పరిశీలకుడు ఆజాద్ హైదరాబాదుకు వచ్చి వెళ్లిన దగ్గర నుంచి కిరణ్‌కు నిద్రపట్టలేదట. ఆ వెంటనే ఆగమేఘాల మీద రావాల్సిందిగా ఢిల్లీ నుంచి పిలుపు కూడా వచ్చింది. దాంతో ఢిల్లీకి వెళ్లి అధినేత్రికి సంజాయిషీ కూడా చెప్పుకోవాల్సి వచ్చింది. కడప ఉపఎన్నికల్లో ఘోర పరాజయం, రాష్ట్రపాలనపై పట్టు సాధించలేకపోవడం వంటి పలు అంశాలపై కిరణ్ వివరణ ఇచ్చుకోవాల్సి వచ్చింది. అధినేత్రితోపాటు ఢిల్లీ పెద్దలు కూడా వ్యవహారశైలిని మార్చుకోమని సలహాలు ఇచ్చారు. మొత్తానికి పదవికి ఎసరు లేకపోవడంతో కిరణ్ ఊపిరిపీల్చుకున్నాడు. అంతా సవ్యంగా జరిగితే తలనీలాలు సమర్పించుకుంటానని సిఎం మొక్కుకున్నాడట. ఆ మేరకు తిరుమల వెళ్లి తలనీలాలు సమర్పించుకొన్నాడు. చూద్దాం! ఆ ఏడుకొండలవాడు ఏం చేస్తాడో!!

## ఈ చైర్మన్ మాకొద్దు బాబోయ్!



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సర్వీస్ కమిషన్ చైర్మన్‌గా రేచల్ ఛటర్జీ వద్దంటూ సాక్షాత్తు కమిషన్ సభ్యులే సిఎంకు ఫిర్యాదు చేయడం రాజధానిలో హాట్‌టాపిక్‌గా మారింది. రేచల్ ఛటర్జీ సీనియర్ ఐఎఎస్‌గా ఇటీవలే రిటైర్ అయ్యారు. నీతినిజాయితీ, ముక్కుసూటి వ్యక్తిత్వంతో ఛటర్జీ మొండి మనిషిగా పేరు తెచ్చుకున్నారు. అవినీతికి ఆలవాలంగా మారి, అనేక ఆరోపణలతో విశ్వసనీయత కోల్పోయిన సర్వీస్ కమిషన్‌ను పునరుద్ధరించే దృష్టితో సిఎం ఏరికోరి ఛటర్జీ వంటి ఐరన్ లేడీని చైర్మన్‌గా నియమించాడు. ఛటర్జీ నియామకాన్ని సిఎం ఎంతో గోప్యంగా వుంచాడు. ఛటర్జీ పేరు బయటకు పొక్కితే రాజకీయుల నుంచి ఒత్తిడి వస్తుందని కిరణ్‌కు తెలుసు. అందుకే ఛటర్జీ నియామక ఉత్తర్వులపై సంతకం అయ్యేదాకా రెండో కంటికి తెలీకుండా జాగ్రత్త పడ్డాడు సిఎం. తీరా ఛటర్జీ నియామకం అయ్యాక సాక్షాత్తు సదరు కమిషన్ సభ్యులు మూకుమ్మడిగా సిఎం దగ్గరకు వెళ్లి ఈ చైర్మన్ వద్దంటూ మొత్తుకున్నారు. అయినా సిఎం ఒత్తిడికి లొంగకుండా ఛటర్జీకి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చాడు. అవినీతి కూపంగా మారిన కమిషన్‌ను ఉతికి ఆరేయటానికి ఛటర్జీకి అండదండలందిస్తానని కూడా సిఎం చెప్పాడట. సో... సిఎం కిరణ్ చేసిన మంచి పనుల్లో ఛటర్జీ నియామకం ఒకటన్నది వేరే చెప్పాలా!

# భర్త, కుటుంబ క్షేమం కోరే వట సావిత్రి వ్రతం!



హైందవ సంస్కృతి సాంప్రదాయాల్లో పండుగలు, పూజలు, వ్రతాలకు ఎంతో ప్రాధాన్యత వుంది. ధర్మార్థ, కామ, మోక్షాల కోసం సరైన బాట నడిచేందుకు, జ్ఞానజ్యోతిని వెలిగించేందుకు ఋషులు ఏర్పరచినవే పండుగలు, వ్రతాలు, నోములు. వృక్షాలను దేవతా స్వరూపంగా భావించి కొలుస్తుంటారు. అందులోనూ వటవృక్షాని(మర్రిచెట్టు)కి ఎంతో ప్రాధాన్యత వుంది. మర్రిచెట్టుకు పూజలు చేయడం వలన భర్తకు దీర్ఘాయుష్షు కల్గుతుందని ప్రతీతి. దీనికి పతివ్రత శిరోమణి సావిత్రి యమ ధర్మరాజును ఎదిరించి భర్త అయిన సత్యవతుడి ప్రాణాలు తిరిగి దక్కించుకొన్నది ఈ వట వృక్షానికి పూజలు చేయడం వలనే అన్నది పురాణ కథనం. సావిత్రి విజయానికి చిహ్నంగా ఈ పండుగను దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో జరుపుకొంటారు.

జ్యేష్ట శుక్ల పూర్ణిమనాడు ఆచరించాల్సిన వ్రతం వట సావిత్రి వ్రతం. ఆనాడు తెల్లవారుజామునే లేచి కాలకృత్యాలు తీర్చుకొని క్రొత్త బట్టలు ధరించి పూజాద్రవ్యాలతో, మర్రిచెట్టు వద్దకు వెళ్లి పూజిస్తారు. సింధూరాన్ని పూసి నూలుదారంతో చెట్టు చుట్టూ పోగులు కడతారు. వటవృక్షం త్రిమూర్తుల స్వరూపంగా చెప్తారు. వేర్లు బ్రహ్మకు, కాండం విష్ణుమూర్తి, కొమ్మలు శివునికి నివాస స్థలాలుగా భావించి పూజలు చేస్తారు. మర్రిచెట్టులా భర్త దీర్ఘాయుష్షుతో జీవించాలని, ఆ చెట్టు నీడనిచ్చినట్లు కుటుంబానికి అండగా వుండాలని కోరుకొంటూ ఈ వ్రతాన్ని ఆచరిస్తారు. పూలు, గాజులు, పసుపు, కుంకుమలు ఆ చెట్టు వద్ద వుంచి దీప ధూప నైవేద్యాలు సమర్పిస్తారు. ఆ రోజంతా ఉపవాసం వుండి వ్రతాన్ని ముగిస్తారు. క్రొత్తగా పెళ్లయిన యువతులతో ప్రత్యేకంగా ఈ వట సావిత్రి వ్రతాన్ని ఆచరింప చేస్తారు.

సతీసావిత్రి వట వృక్షాన్ని పూజించినందునే యమధర్మరాజు ఎన్ని కష్టాలు పెట్టినా వెనకడుగు వేయక ఎదిరించి భర్త ప్రాణాలు తిరిగి పొందగలిగిందని ఆమె పతి భక్తి ముందు యముడు నిలువలేక పోయాడని, దీనికంతటికి ఆ వ్రత మహిమే కారణంగా చెప్తారు. అందుకు భర్త, కుటుంబ క్షేమం కోరే మహిళలు వట సావిత్రి వ్రతాన్ని ఆచరిస్తారు.





## ట్రంకు రోడ్డు

## షాక్ తిన్న ఎస్పీ దామోదర్




నెల్లూరు జిల్లాలో పని చేసిన ఎస్పీలందరూ ఒక ఎత్తు. ఈతముక్కల దామోదర్ మరో ఎత్తు. గత ఏడాది ఇక్కడ విధులు చేపట్టిన ఆయన మూడేళ్ల పాటు జిల్లాలోనే వుంటానని భావించారు. మంచి మాటకారి అయిన దామోదర్‌తో ఎవరూ ఎదురు మాట్లాడలేని పరిస్థితి. ఈ చాకచక్యంతోనే కృష్ణపట్నం పోర్టు, మద్యం వ్యాపారులు, ఇసుక మాఫియాలతో నెల మామూళ్లు కుదుర్చుకొన్నారంటారు. చోరీసొత్తు రికవరీలోనూ చేతివాటం చూపారని గగ్గోలు. నేను అందరివాడ్ని నాకు బదలీ కూడా వుండదని ప్రకటించిన ఈయన చేసిన గురివింద గింజ పనులన్నీ క్రింది ఆఫీసర్లపైకి తోసేస్తారు. హోమ్‌గార్డుల ఎంపిక వెనుక జరిగిన లక్షల రూపాయల వసూళ్లే దీనికి మంచి వుదాహరణ అంటారు. కాని గుంటూరు రేంజ్ ఐజి మాత్రం ఎస్పీపై లోతు దర్యాప్తు చేయించి ప్రభుత్వానికి సమర్పించిన నివేదికనే దామోదర్‌ను బదలీ చేయించిందంటున్నారు. గతవారం బదలీని ఆపుకోను ఎస్పీ హైదరాబాద్ వెళ్లినా అది ఆగకపోవడంతో ఆయన షాక్ తిన్నట్లు పోలీసు వర్గాలే వాఖ్యానిస్తున్నాయి.

## ముందు ఈయన... వెనుక ఆయన!



నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి పరిస్థితి డూడూ బసవన్నలా తయారయ్యింది. వాస్తవానికి శ్రీధర్‌కృష్ణారెడ్డికంటే రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డికి నగర పాలనపై పట్టు అధికం. నగరంలో ఎమ్మెల్యేను ఎందుకు వదలి పెట్టాలని ఆయన్ను ప్రతి కార్యక్రమానికి తీసుకెళ్తారు. ముందు మైక్ కూడా ఆయనకే ఇచ్చి మాట్లాడిస్తాడు. ఆ తర్వాత వివేకానందరెడ్డి మైకందుకొని ప్రత్యర్థులను నోరార తిడతారు. ఎన్నాళ్లు వివేకా వెనుక తిరగాలని శ్రీధర్‌కృష్ణారెడ్డి అనుచరులల్లో ప్రశ్న వుదయించినా ఆయనలో మార్పు లేకపోవడం వాళ్లను నిస్తేజ పరుస్తోంది.

## పాత్రికేయులకు దూరం!



నెల్లూరు కలెక్టర్‌గా బాధ్యతలు తీసుకొన్న బి.శ్రీధర్‌రెడ్డి తన ధోరణిలో తాను పని చేసుకపోతున్నారు. జిల్లా గూర్చి అవగాహన కోసం వివిధ మండలాలలో పర్యటించిన ఆయన, వివిధ శాఖల సమీక్షా సమావేశాల్లోనూ అధికారులు ఏ విధంగా పని చేయాలన్న విషయమై దిశా నిర్దేశం చేస్తున్నారు. సహజంగా కలెక్టర్, ఎస్పీల వంటి అధికారులు మీడియాతో దగ్గరగా మసలుతుంటారు. కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి మాత్రం మీడియాను దగ్గరకు రానీయడం లేదు. కలెక్టరేట్‌లో పెత్తనం చేసే కొందరు మీడియా ప్రముఖులతో పాటు సాధారణ పాత్రికేయులను సైతం కలవను ఆయన ఆసక్తి చూపడం లేదు. ఇప్పటి వరకు ఏ దినపత్రిక విలేఖరికి సైతం ఆయన తన ప్రాధాన్యతలు తెలియజేస్తూ ఇంటర్వ్యూ ఇవ్వడానికి సైతం ఇష్టపడలేదు. దీనికి కారణం దారి తప్పిన నెల్లూరు పాత్రికేయత అందామా?

## పాపం... శ్రీధర్



కాంగ్రెస్ పార్టీలో రెబల్ స్టార్‌గా గుర్తింపు పొంది ఆనం సోదరులకు వ్యతిరేకంగా రాజీవ్ భవన్‌ను నడిపిన నేతల్లో ముఖ్యుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి. వైఎస్ జగన్ పార్టీ స్థాపించక ముందు నుంచే ఆయన తరఫున గట్టిగా మాట్లాడే నేతగా రాష్ట్రంలో గుర్తింపు పొందాడు. తుఫాన్‌లోనూ నెల్లూరులో జగన్ ఓదార్పు యాత్రను విజయవంతం చేసిన ఘనత దక్కించుకొన్నాడు. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ రాష్ట్ర కార్యవర్గంలో ఆయనకు తప్పకుండా చోటు లభిస్తుందని అందరూ భావించారు. కాని చివరికి నెల్లూరు నేతలెవరికీ ఆ ఛాన్స్ లభించలేదు. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ నిర్మాణ సౌధానికి రాళ్లెత్తిన 'కూలీ'కి మొండిచేయి చూపితే ఎలానని ఆ పార్టీ నేతలు, కార్యకర్తలు లోలోన మధన పడుతున్నారే తప్ప బయటకు వెల్లడించడం లేదు.

## ఆమె అంటే హడల్!



నెల్లూరు నగరంలో భైరవ రాజ్యం నడుస్తోంది. శునకాలను గత దశాబ్ద కాలంగా పట్టకపోవడంతో జనసంఖ్యను మించి పెరిగిపోతున్నాయి. దీనికి కారణం మూగజీవాల సంరక్షణ సంఘం నాయకురాలు వీటిని పట్టి చంపకూడదంటూ న్యాయస్థానాలలో వేసిన వాజ్యాలు. కార్పొరేషన్ సిబ్బంది రహస్యంగా కుక్కలు పట్టినా ఆమె వూరుకోదు. పట్టిన వారిని పట్టుకొని దుంప తెంచుతుంది. రాష్ట్రవ్యాప్తంగా రేబిస్ కేసుల మరణాలు నమోదవుతున్న తరుణంలో రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి నగరంలో కుక్కలు పట్టించమని కమిషనర్‌కు హుకుం జారీ చేసినా వాటి జోలికి మాత్రం వెళ్లడం లేదు. ఏదిఏమైనా జనం తిరగబడితే తప్ప నెల్లూరులో శునకాల నిర్మూలన జరిగేటట్లు లేదు.

# వారఫలాలు

తేది 04-6-2011 నుండి 10-6-2011 వరకు వృషభంలో రవి, బుధులు; మేషంలో కుజ, గురువులు; మేష, వృషభాల్లో శుక్రుడు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; వృషభంలో కేతువు; మిధున, కర్కాటక, సింహ, కన్యల్లో చంద్రుడు సంచరిస్తారు.




ఇరుగుపొరుగు వారి వల్ల వుంటూ వచ్చిన ఇబ్బందులు తొలగుతాయి. వృత్తి ఉద్యోగాలలో మంచి మార్పులు జరిగి విస్తరణ ప్రయత్నాలు చేస్తారు. రియల్ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి. ఎదురుచూసిన చోటి నుండి ఆదాయం చక్కగా లభిస్తుంది. ఇతరుల పనుల కోసం బాధ్యతలు స్వీకరిస్తారు. జామీను విషయంలో జాగ్రత్త. పుణ్యకార్యాలలో పాలు పంచుకొంటారు.




వారాంతంలో ప్రత్యుత్పాదకావయవాల బాధలుండవచ్చు. కుటుంబ సభ్యులతో సఖ్యత తగ్గుతుంది. ఇతరుల జోలికి పోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. నూతన వృత్తికి సంబంధించి చేసే ప్రయత్నాలకు మంచివారి తోడ్పాటు లభిస్తుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి. విలువైన గృహోపకరణాలు కొంటారు. తోటివారిలో అమర్యాద ప్రాప్తి,




ఆర్థిక సమస్యలు ఎదురౌతాయి. కాని తృప్తికరంగా కాలం గడుస్తుంది. ప్రశాంతంగా కాలం గడపడం మంచిది. మానసిక వేదన, ఒత్తిడి కొంత తగ్గవచ్చు. స్పెక్యులేషన్ మంచిది కాదు. కుటుంబ సభ్యులతో సఖ్యత తగ్గుతుంది. సంబంధం లేని విషయాల జోలికి పోకుండడం మంచిది. బంధుమిత్రుల పనుల కోసం శ్రమ తప్పదు. దాంపత్యసుఖం చక్కగా ఉంటుంది.




వసతి గృహమార్పిడులకు అవకాశాలున్నాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది. సోదరులతో గొడవలు తొలగుతాయి. వ్యాపారంలో పోటీ నెదుర్కొంటారు. కొత్త ఖాతాదారులు ఏర్పడే అవకాశం కలదు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు అనుకొన్న రీతిలో మంచి ఆదాయాన్నిస్తాయి. దొంగచాటు వ్యక్తుల ఎత్తుగడల్ని తిప్పి కొడతారు. సమాజంలో ప్రతిష్ఠ గల వారి పరిచయం వల్ల భవిష్యత్తులో సత్ప్రయోజనాలనిస్తుంది.




ఎదురుచూసిన అవకాశాలు లభించే కాలం. నూతనోత్సాహంతో పనులు కొనసాగిస్తారు. బాంకు నిల్వలు పెంచే ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగులకు వారి పలుకుబడి పెరుగుతుంది. అనుకూల సంభాషణలతో మీ పని సాధించుకొంటారు. పరోక్ష శత్రుత్వం దూరమవుతుంది. వృత్తి వాపారాభివృద్ధి కోసం అప్పులు చేస్తారు. ఆరోగ్య విషయాలు మెరుగ్గా ఉంటాయి.




కుటుంబసభ్యులతో అనుకూలంగా నడుచుకోవాలి. మనశ్చింత ఉండవచ్చు. ఖర్చులధికం. కోరిన వ్యక్తుల్ని కలుసుకొంటారు. ఆదాయం బాగుంటుంది. మానసిక విశ్రాంతి అవసరం. వృత్తిరీత్యా ఉత్సాహం శ్రమ ధనాదాయం అధికమవుతుంది. కళత్ర సుఖం చక్కగా వుంటుంది. ధనాదాయం చక్కగా వుంటుంది. స్పెక్యులేషన్ కూడా లాభిస్తుంది. పౌరసంబంధాలు బాగుంటాయి.




భాగస్వామ్యాలలో మంచి లాభావకాశాలు. రాజకీయాలలో పాలు పంచుకొంటారు. రుణబాధోపశమనానికి కొత్త పథకాలు ఆలోచిస్తారు. కుటుంబంలో సఖ్యత కొరవడుతుంది. వృత్తిలో బదిలీలు మనసుకు సంతోషకరంగా ఉండవు. దైవకార్యాలలో పాలుపంచుకోవడం మంచిది. ఇష్టులకు అయిష్టదూర వార్తాశ్రవణం. మాతృ సంబంధీకులతో ఏర్పడిన గొడవలు తొలగిపోతాయి.




ఇతరుల ఆలోచనలకై పరుగెడుతారు. భాగస్వామ్యాలలో మంచి లాభావకాశాలు. రాజకీయాలలో పాలు పంచుకొంటారు. రుణబాధోపశమనానికి కొత్త పథకాలు ఆలోచిస్తారు. కుటుంబంలో సఖ్యత కొరవడుతుంది. సంఘంలో ప్రసిద్ధిచెందిన వారి సమాగమం మంచి భవిష్యత్తుకు పునాది వేస్తుంది. గొడవలు పడ్డవారితో సత్సంబంధాలు నెలకొంటాయి. సోదరీ సోదరులతో హాయిగా కాలక్షేపం చేస్తారు.




నిదానంగా ఆలోచించి పనులు సాగించి మంచి ఫలితాల నందుకొంటారు. ఆదాయం ఖర్చు సమానంగా ఉంటాయి. శ్రమకు తగ్గ ఫలితం దక్కుతుంది. బంధువులతో మనస్పర్థలకు అవకాశం ఇవ్వవద్దు. సోదరుల మూలంగా శ్రమ. వివిధ మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉంటాయి




మనశ్శాంతి తక్కువ. కుటుంబసభ్యులతో గొడవలు. ఊహించని రీతిలో ధనవ్యయమవుతుంది. సంతాన మూలకంగా కూడ ఇబ్బందులు. మాతృసంబంధీకుల తోడ్పాటు లభిస్తుంది. వివిధ మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములతో, ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి.




ఇతరులపై మీదే పైచేయి. దూరం నుండి శుభవార్తాశ్రవణం. అప్పులు తీరుస్తారు. వృత్తి వ్యాపార ఉద్యోగాలలో మంచి ఆదాయం. వినోదాలతో కాలక్షేపం చేస్తారు. విరక్తి నిస్సంగత్వం చోటు చేసుకొంటుంది. దైవ సాయంతో చిన్న చిన్న ఆటంకాలను అధిగమిస్తారు. కళత్రసంబంధం చక్కగా ఉండకపోవచ్చు. వృత్తిలో అత్యధిక శ్రద్ధ అవసరం. దూరపు బంధువుల నుండి శుభవార్తాశ్రవణం.




ఆహారవిషయంలో జాగ్రత్త అవసరం. రుణబాధా నివృత్తికి ప్రయత్నాలు చేస్తారు. భాగస్వామ్యాలలో వుంటూ వచ్చిన సమస్యలు తొలగిపోతాయి. కళత్ర సంబంధం చక్కగా వుంటుంది. మాటలు జాగ్రత్తగా రానివ్వాలి. తగాదాల్లో విజయం మీదే. ఇష్టులైనవారి ద్వారా మీరు కోరుకొన్నవి సాధించుకొంటారు. సోదరులు సాయమందిస్తారు. తృప్తికరంగా దైవపూజాదులలో పాలు పంచుకొంటారు.

## పంచాంగం

4 తేది రజ్జబ్ నెల ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

5, 8 తేదీల్లో కర్కాటక లగ్నాన ఉ.08.00 నుండి 10.00 గంటల వరకు.

10 తేదీ సింహ లగ్నాన ఉ.11.00 నుండి 1.00గంట వరకు. మకర లగ్నాన రా. 8.30 నుంచి 10.30 గంటల వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### జూన్ తిథులు
### జ్యేష్ఠ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 4 | శని | తదియ | రా 1.54 | గం.ల.వ |
| 5 | ఆది | చవితి | రా 12.51 | గం.ల.వ |
| 6 | సోమ | పంచమి | రా 11.18 | గం.ల.వ |
| 7 | మంగళ | షష్ఠి | రా 9.31 | గం.ల.వ |
| 8 | బుధ | సప్తమి | రా 7.22 | గం.ల.వ |
| 9 | గురు | అష్టమి | సా 5.02 | గం.ల.వ |
| 10 | శుక్ర | నవమి | ప 2.49 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com

# కర్తరీ, మౌఢ్యం వాస్తుశాస్త్ర నిషిద్ధాంత వర్గభేదములు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*అప్పికట్ల ధర్మారావు — గుంటూరు*

* *కత్తెర, మూఢంలలో వాస్తు పనులు చేయకూడదంటున్నారు. శుభముహూర్తాలు లేవంటున్నారు?*

డొల్లు కర్తరిలో పనులకు పాటింపులేదు. నిజ కర్తరిలో, మూఢంలో గృహసంబంధమైన కఱ్ఱ, మట్టి పనులు చేయగూడదంటారు. అయితే అప్పటికే ప్రారంభించిన గృహాలకు ఈ నిషిద్ధం వర్తించదు.

*డి.శకుంతల — నెల్లూరు*

* *స్థలాలు, స్థలం సర్దుబాట్లు చేసుకోకూడదా?*

వాస్తుశాస్త్రజ్ఞులకు ఈ కాలాలలో స్థలాలు చూపించుకోవచ్చు. ప్లానులు వేయించుకోవచ్చు. శంకుస్థాపనలు, నిర్మాణాలు తప్ప మరే ఇతర పనులైనా చేసుకోవచ్చు.

*ఎన్.శాంభవీలక్ష్మి — హైదరాబాద్*

* *నిషిద్ధ కాలాలలో ముహూర్తాలు వుండవా?*

కర్తరి, మౌఢ్య కాలాలలోనూ ముహూర్తాలు వుంటాయి. అన్నప్రాసన, గర్భాదానం, పూజా పునస్కారాలూ, యంత్ర ప్రతిష్టలు చేసుకోవచ్చు.

*కొలనుమాను వైష్ణవి — బెంగుళూరు*

* *'సంధ్యా కాలం ప్రశస్తం' అని యంత్ర ప్రతిష్టకు 'యంత్ర సారస్వతం' చెబుతోంది.*

నిజమే యంత్రాన్ని ఉదయ, సాయం సంధ్యలలో నిమ్మబలి 'విధానం'తో ప్రతిష్టించాలి.

*పసపర్తి ప్రహ్లాదుడు — గూడూరు*

* *నా పేరు ప్రహ్లాదుడు. నా పేరుకు నక్షత్రం తెలియదంటున్నారు.*

జన్మ నామ నక్షత్ర గణనలో మీ పేరు ప్రత్యేకమైనది. అందువల్ల జ్యోతిష గ్రంథాలలో మీ పేరుకు నక్షత్రం ఇవ్వరు. అయితే 'లగద శాస్త్ర విహిత'లో మీ పేరుకు చిత్త 3వ పాదాన్ని ఇస్తున్నారు. అంటే మీది 'తులా రాశి' అన్నమాట.

*ఎల్.లక్ష్మీకాంతమ్మ — విజయవాడ*

* *అమ్మాయిది 'కన్య' రాశి, అబ్బాయిది 'వృశ్చిక' రాశి. వివాహం చేయవచ్చునా?*

జాతి, వర్ణ, వర్గ ప్రకారం కుదరదని చెప్పారన్నారు. వారి అభిప్రాయం తప్పు. అబ్బాయిది వృశ్చికం బ్రాహ్మణ వర్గు, అమ్మాయిది శూద్ర వర్గుకు చెందుతుంది. అబ్బాయిది ఉచ్ఛ వర్గు కాబట్టి కుదురుతుంది. అనుమానం వద్దు.

*పి.రఘురామయ్య — ఒంగోలు*

* *వివాహం అయ్యాక అబ్బాయి పూర్తిగా మారిపోయాడు.*

రత్నధారణలో 'నవరత్న ధారణ' ఒకే ఉంగరంలో ధరించరాదు. మిత్ర, శత్రు గ్రహ సంబంధిత రెండు రత్నాలు మాత్రమే ధరించాలి. అలా చేసి చూడండి.

*వై.అనంతరెడ్డి — బుచ్చిరెడ్డిపాళెం.*

* *'భుజ దోష వేధ' అంటే ఏమిటి? మేమేం చేయాలి?*

నిర్మాణంలో నైరుతి భుజానికి వాయువ్య భుజం, ఈశాన్య భుజం సమానంగా వుండాలి. తగ్గితే 'భుజ దోష వేధ' అంటారు. మీరు వెంటనే వాస్తు యంత్ర ప్రతిష్ట చేసుకొని ఆరు మాసాల లోగా ఆ దోషాల్ని సరి చేయండి.

*షేక్ ఇమాంసాబ్ — చెన్నై*

* *తూర్పు రోడ్డు ఉత్తరం వచ్చి, తూర్పు ఇంట్లోకి ప్రవేశించాలి. ప్లాటుకు నైరుతిలో మెట్లు, లిఫ్టు వున్నాయి.*

నైరుతి అగాధమయింది కాబట్టి 'దిష్టి' దోషం ఎక్కువ. 'నరఘోష యంత్రం' ప్రతిష్ట చేయండి.

*పి.అనంతయ్య — నాయుడుపేట*

* *అపార్టుమెంటు ప్లాటులో దిక్కులు పెరిగాయి?*

దిక్కులు పెరిగితే సంబంధిత యంత్ర ప్రతిష్ట చేసుకొని, నూట ఇరవై రోజుల్లో పరిస్థితులు మారకపోతే 'ప్లాటు' ఖాళీ చేయడం మంచిది.

*సి.ఆర్.రవీంద్రారెడ్డి — సికింద్రాబాద్*

* *బలి విధానాన్ని మీరు నమ్ముతారా? ఇటీవల హైదరాబాద్‌లో 'నరబలి' ఇచ్చారట?*

శాక్తేయంలో కూడా 'నరబలి' విధానాన్ని గురించి చెప్పలేదు. మనుషులలో రాక్షస ప్రవృత్తి ఎక్కువై పోతోంది. గృహబలి గుమ్మడి, నిమ్మ, టెంకాయ, కుంకుమ, పసుపులతో చేయాలి. 'నరబలి' వల్ల ఆత్మ 'శక్తియై' యజమాని కుటుంబాన్ని సర్వనాశనం చేస్తుంది!

# ఇందిరక్రాంతి పథం సిబ్బంది మధ్య లడాయి!

**ఈ పథకం ప్రాజెక్ట్ డైరెక్టర్ సిబ్బందిపై పట్టుకోల్పోవడంతో సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ ఒకరిపై మరొకరు ఆధిపత్యం చెలాయించే స్థాయికి చేరుకొన్నారు.**

జిల్లా ఇందిరక్రాంతి పథం సిబ్బంది మధ్య అంతర్గత విభేదాలు చోటుచేసుకొంటున్నాయి. పరిపాలనా పరంగా ప్రాజెక్టు డైరెక్టర్ పట్టుకోల్పోవడంతో సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ ఒకరిపై మరొకరు ఆధిపత్యం చెలాయించే స్థాయికి చేరుకొంటున్నారు. ఇటీవల ఇందిర క్రాంతిపథం సిబ్బంది బదలీల కౌన్సిలింగ్ జరిగింది. ఈ కౌన్సిలింగ్‌లో కొందరికి అనుకూలంగానూ, మరికొందరికి వ్యతిరేకంగానూ బదలీలు చేపట్టారన్న ఆరోపణలు వున్నాయి. ప్రాజెక్టు డైరెక్టర్ కొందరికి అనుకూలంగా వ్యవహరిస్తూ మిగిలిన వారి పట్ల వ్యతిరేక ధోరణి అవలంభిస్తున్నారన్న ప్రచారం జరుగుతోంది.

## బహిర్గతమైన విభేదాలు

గతవారంలో ఇందిరక్రాంతి పథం కార్యాలయంలో సిబ్బంది మధ్య చోటు చేసుకున్న విబేధాలు ఒక్కసారిగా బహిర్గతమైనాయి. ఇద్దరు ఎపిఎంలు కార్యాలయంలో పనిచేస్తున్న మరో ఉద్యోగిపై దౌర్జన్యానికి దిగడంతో ఇరువురి మధ్య ఘర్షణ జరిగింది. కార్యాలయ సమయంలో ఒకరిపై మరొకరు వ్యక్తిగత దూషణలు చేసుకోవడంతోపాటు అసభ్యకరమైన పదజాలాన్ని వాడారు. పత్రికల్లో వ్రాయలేని విధంగా దూషించుకోవడంతో మహిళా ఉద్యోగులు చెవులు మూసుకొని బయటకు వెళ్లిపోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఘర్షణ పడుతున్న వారిని సర్దిచెప్పేందుకు ఎవరు కూడా సాహసించలేకపోయారంటే ఇక్కడ పరిస్థితులు ఏ విధంగా వున్నాయో ఊహించుకోవచ్చు.

## పర్యవేక్షణ లోపం

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ఇందిరక్రాంతి పథం సిబ్బంది పనితీరుపై పర్యవేక్షణ లోపించింది. పర్యవేక్షణ చేయాల్సిన ప్రాజెక్టు డైరెక్టర్ ఆ దిశగా దృష్టి సారించలేకపోతున్నారు. శాఖాపరంగా బాధ్యతలు అధికం కావడంతో క్రిందిస్థాయి అధికారులకు పర్యవేక్షణ చేసే బాధ్యతలు అప్పగించినట్లు తెలిసింది. మండల కేంద్రాలు, పంచాయితీ పరిధిలో విధులు నిర్వహించే ఎపిఎం, సి.సిలు ప్రభుత్వ విధులకు డుమ్మా కొడుతూ స్వంత పనులను చక్కబెట్టుకొనే పనిలో నిత్యం బిజీగా కనిపిస్తుంటారు. ఇందిరక్రాంతి పథం కార్యాలయంలోనూ సంవత్సరాల తరబడి వున్న వారిని బదలీ చేయడం లేదు.

రాజకీయ పలుకుబడి వున్న వారిని కదిలించేందుకు అధికారులు భయపడుతుంటారని కొందరు సిబ్బంది వ్యాఖ్యానిస్తున్నారు. పి.డికి అనుకూలంగా వ్యవహరించే సిబ్బంది ఏం చేసినా చెల్లుబాటు వుంటుందని, వీరు చెప్పిందే వినడంతో ఇతర సిబ్బందికి తీవ్ర అన్యాయం జరుగుతుందని వాపోతున్నారు. యూనియన్ పేరుతో కొందరు నాయకులు అధికారులను బెదిరిస్తూ పబ్బం గడుపుకొంటున్నారన్న ప్రచారం వుంది. గత సంవత్సర కాలంగా ఇందిరక్రాంతి పథం సిబ్బంది పనితీరు ఆశించిన మేర వుండడం లేదు. ఈ శాఖలో సిబ్బంది ఎపిఎం, సిసిలను ప్రభుత్వం రెగ్యులర్ చేయడంతో అధికారులు ఏం చేయలేరన్న ధీమాతో కొందరు ప్రవర్తిస్తున్నారు. అంతర్గత విబేధాలు, ఆధిపత్యపోరు కారణంగా ఇందిరక్రాంతి పథం పరువు బజారున పడింది. కార్యాలయంలో ఇంత జరుగుతున్నా సంబంధిత అధికారులు ఏ మాత్రం స్పందించి చర్యలు చేపట్టక పోవడం విశేషం. జిల్లా కలెక్టర్ ఈశాఖపై ప్రత్యేక దృష్టి సారించి విధులకు డుమ్మా కొడుతున్న సిబ్బందిపై చర్యలు తీసుకోవడంతోపాటు గ్రామీణ ప్రాంతాలలో స్వయం సహాయక సంఘాల పనితీరు సమీక్షించాల్సిన అవసరం వుంది. J

రైతు చైతన్య యాత్రలు

# రైతు చైతన్య యాత్రల్లో రైతులేరీ?

**జిల్లాలో జరిగిన రైతు చైతన్య యాత్రలకు స్పందన అంతంత మాత్రమే. రెండవ పంటను సాగుచేస్తున్న రైతులు ఈ చైతన్య యాత్రలకు హాజరయ్యే తీరికే లేకుండా పోయింది.**

జిల్లావ్యాప్తంగా ఈ నెల 17వ తేది నుంచి జరుగుతున్న రైతు చైతన్య యాత్రల్లో రైతులు కనిపించడం లేదు. వ్యవసాయ శాఖ, దాని అనుబంధ శాఖల అధికారులే గ్రామాల్లో తిరుగుతున్నారు. గ్రామ పంచాయితీ కార్యాలయాల వద్ద ఒక షామియానా, నాలుగు కుర్చీలు ఏర్పాటు చేసుకొని ఉపన్యాసాలు ఇచ్చి వెళ్తున్నారు అధికారులు. ప్రస్తుతం పెన్నా డెల్టా క్రింద రెండవ పంట సాగుచేస్తున్నారు. వ్యవసాయానికి అవసరమైన పనులు చేసుకోవడంలో రైతులు నిత్యం బిజీగా వున్నారు.

రైతు చైతన్య యాత్రలకు సంబంధించిన అన్ని ఏర్పాట్లు విఆర్వోలు చేయాలని ఆదేశాలు వెళ్లడంతో ఇందుకు అవసరమైన ఖర్చును వారు భరించక తప్పడం లేదు. పది రోజుల క్రితం ప్రారంభించిన ఈ చైతన్య యాత్రలు జూన్ 2వ తేది వరకు జరుగుతాయి. రైతు చైతన్య యాత్రల పేరుతో గ్రామాలకు వెళ్లిన అధికారులు గ్రామ ప్రజల నుంచి వివిధ రకాలుగా నిరసనలు ఎదుర్కోవాల్సి వస్తుంది. తాగునీటి సమస్య, రేషన్ కార్డుల జారీ, భూమి హక్కులు, పట్టాదారు పాసుపుస్తకాల మంజూరు, విద్యుత్ సమస్య ఒకటేమిటి గ్రామాల్లో వున్న అన్ని సమస్యలపై అధికారులను నిలదీసి ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు.

అధికారులు ఎంతచెప్పినా వారు వినడం లేదు. సమస్యలను పరిష్కరించకుండా ఎందుకు గ్రామాలకు వస్తున్నారని ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. చేసేదేమీలేక అధికారులు గ్రామాల నుంచి వెనుదిరగక తప్పడం లేదు. ఒక గ్రామంలో నిరసనలు ఎదుర్కొన్న అధికారులు మరో గ్రామానికి వెళ్లేందుకు భయపడే పరిస్థితి కలిగింది. రాష్ట్ర ప్రభుత్వం ఏ ఉద్దేశ్యంతో ఈ యాత్రలను నిర్వహించాలని ఆశించిందో అది నెరవేరే అవకాశం కన్పించడం లేదు. అధికారులు సైతం తొలి నుంచి కూడా రైతు చైతన్య యాత్రల పట్ల కొంత అయిష్టంగానే వున్నారు. గతంలో ఎదురైన చేదు అనుభవాలను దృష్టిలో వుంచుకొని ఈ దఫా నిర్వహించే యాత్రలకు డుమ్మా కొట్టాలని భావించినా కలెక్టర్ ఆదేశాలతో విరమించుకొన్నారు.

## అధికారులకు అదనపు భారం

త్వరలో స్థానిక సంస్థల ఎన్నికలు నిర్వహించనున్న దృష్ట్యా ఓటరు జాబితాను సిద్ధం చేయాలని ఎన్నికల సంఘం నుంచి ఇప్పటికే జిల్లాకు ఆదేశాలందాయి. పంచాయితీ, మండల పరిషత్, జిల్లా పరిషత్తులతోపాటు మునిసిపల్ ఎన్నికలు కూడా జరుగుతాయి. మండల స్థాయి మండల వరిషత్ అభివృద్ధి అధికారి, తహశీల్దార్లు ఓటరు జాబితా వివరాలను పంపాల్సి వుంటుంది. మరోప్రక్క తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో నిర్వహించిన కళ్యాణమస్తు బాధ్యతలనూ వీరికే అప్పగించడంతో అదనపు పని భారం పడింది.

పరిపాలనాపరంగా కార్యాలయ పనితీరును పర్యవేక్షించాల్సి వుంటుంది. ఇన్ని బాధ్యతలను ఒకే సమయంలో నిర్వర్తించాల్సి రావడం అధికార యంత్రాంగానికి తలనొప్పిగా మారింది. ఇదే సమయంలో రైతు చైతన్య యాత్రలు ప్రారంభం కావడం, ఇందులో తప్పనిసరిగా తహశీల్దార్, ఎమ్పీడిఓలు పాల్గొనాల్సి రావడంతో వీటిని కూడా సక్రమంగా నిర్వహించలేక పోతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలకు అవసరమైన మౌలిక సదుపాయాలు కల్పించాలంటే ఆర్థిక వనరులతో ముడిపడి వుంటుంది. ప్రభుత్వం మాత్రం అభివృద్ధి పనులకు నిధులు మంజూరు చేయకుండా చైతన్య యాత్రల నిర్వహణకే రోజుకు ఒక్కో మండలానికి వెయ్యి రూపాయల వంతున విడుదల చేసింది. గతంలో నిర్వహించిన చైతన్య యాత్రలకంటే ఈ దఫా జరుగుతున్న యాత్రలు రైతుల వద్దకు చేరుకోలేక పోతున్నాయి. కేవలం కొంత మంది ఆదర్శ రైతులను వెంటబెట్టుకొని గ్రామాల్లో తిరగాల్సి రావడం విశేషం.

# నాగార్జున పుత్రోత్సాహం



తన కుమారుడు నాగచైతన్య హీరోగా నటించిన 100%లవ్ సినిమా విజయవంతం కావడంతో హీరో నాగార్జునలో నూతనోత్సాహం వెల్లి విరుస్తుంది. ఈ విషయమై మాట్లాడుతూ సినిమా చూసిన తర్వాత ఏం చెప్పాలో అర్ధం కాలేదు. నేను జడ్జ్ చేయలేనేమో అనిపించింది. ఎందుకంటే నాది ప్రేమకథలు చూసే వయసు కాదు. యువతరం ఈ సినిమాను ఎలా స్వీకరిస్తుందో అనుకొన్నాను. కానీ ప్రేక్షకుల స్పందన చూస్తుంటే చాలా సంతోషంగా వుంది. నా సినిమా వసూళ్లనీ కూడా అధిగమించడం ఇంకా ఆనందంగా వుందన్నాడు నాగార్జున.

# గ్లామర్‌తో ఆకట్టుకొంటాను!



హీరోయిన్లు ప్రేక్షకుల్లో గుర్తింపు తెచ్చుకోవాలంటే అభినయం మాట ఎలా వున్నా అందం మాత్రం తప్పనిసరి. అప్పుడే చూసేవాళ్లను ఆకర్షించగలుగుతారు. ఈ విషయాన్ని వర్ధమాన హీరోయిన్ తాప్సి కూడా బలంగా నమ్ముతుంది. తొలిచిత్రం ఝుమ్మంది నాదంలో ఈ అమ్మడి అందాలకు మంచి మార్కులుపడ్డాయి. ఈ మధ్య మిస్టర్ పర్ఫెక్ట్, వీర చిత్రాల్లో గ్లామర్ పాత్రల్లో కనిపించింది. మీరు గ్లామర్‌నే నమ్ముకున్నారా అని అడిగితే... నేను పోషించే పాత్రలన్నీ కూడా నా వయసుకి తగినవే వస్తున్నాయి. నేను నటించే పాత్రల్లో గ్లామర్‌కి అవకాశం వుంది కాబట్టి అందంగా కనిపిస్తున్నాను. ప్రేక్షకులకు నచ్చినట్లు కనిపించడం తప్పు కాదు కదా అంటూ చెప్పుకొచ్చింది తాప్సి.

# ద్విపాత్రాభినయం చేస్తా!

యుగానికి ఒక్కడు చిత్రంలో సెకండ్ హీరోయిన్ ఆండ్రియా జెర్మియాను అంత తేలిగ్గా మరువరు. ఈ చిత్రంలో ఆమె చేసిన అందాల ప్రదర్శన అటువంటిది. ఆండ్రియా నటించడంతోపాటు గాయనిగా కూడా కొనసాగుతుంది. తెలుగు చిత్రం రాఖీలో ఆమె పాడిన 'జరజర' పాట అందరికీ గుర్తుండే వుంటుంది.



ప్రస్తుతం అజిత్‌తో ఓ తమిళ చిత్రంలో నటించను హైదరాబాద్ వచ్చిన ఆండ్రియా పిచ్చాపాటీగా మాట్లాడింది. నాకు నటన, పాటలు పాడదం కూడా ఇష్టమే. కథలో ప్రాధాన్యం వున్న ఏ పాత్రయినా చేస్తాను. ఐటెం పాటలైతే పాడుతాను గానీ నర్తించనంది.

# హుషారు తగ్గిన అనుష్క!



స్వీటి అనుష్క ఇంటిపై ఆదాయపన్ను శాఖాధికారులు దాడి జరిపినప్పటి నుంచి ఆమెలో హుషారు తగ్గింది. కంగారుగా కనిపిస్తుంది. ఈ విషయమై ఆమెను ప్రశ్నిస్తే ఇంకో రకంగా సమాధానం చెప్పింది. ఐటీ అధికారులు దాడి చేయడం అనేది చాలా మామూలు విషయం. అయితే దానివల్ల నేనేదో బెంగపెట్టుకొన్నానడం అవాస్తవం. నా దృష్టి అప్పుడు... ఇప్పుడు ఎప్పుడూ సినిమాల మీదనే. బయట షూటింగ్‌లు వుండడం వల్ల హైదరాబాద్‌లో లేను. దానిపై వెబ్ సైట్లలో ఏవేవో వ్రాశారు. అవన్నీ గాలి కబుర్లని చెప్పుకొచ్చింది.

# కంగన కస్సుబుస్సు!



బాలీవుడ్ హీరోయిన్ కంగన రనౌత్‌కు పట్టరానంత కోపం వచ్చింది. షూటింగ్ జరిగేచోట కేర్ వ్యాన్‌లోకి వెళ్లి తలుపులు వేసుకొంది. కంగనకు ఇంత కోపం తెప్పించిన సంఘటన ఏమిటి అంటారా? ప్రస్తుతం ఈ అమ్మడు సంజయ్‌దత్ కథానాయకుడిగా నటిస్తున్న 'డబల్ ధమాల్' చిత్రంలో నటిస్తోంది. ఒక పత్రికలో 'కంగనా – సంజయ్‌కు బాగా దగ్గరయ్యే ప్రయత్నంలో వుందనీ, అందుకోసం రకరకాలుగా ప్రయత్నిస్తున్నట్లు వార్త వచ్చింది. దీంతో కంగన ఫైర్ అయ్యింది. ఇదంతా ఈ చిత్ర బృందంలోని కొంతమంది చేస్తున్న తప్పుడు ప్రచారం. నేను సంజయ్‌కు దూరంగా వుంటున్నానంటూ తెగ బాధపడిపోయింది. సహాయ దర్శకులు వచ్చి ఎంతజెప్పినా నేను తలుపు తీయను అంటూ వ్యాన్‌లోనే భీష్మించుకొని కూర్చొంది. దీంతో షూటింగ్‌కు ఆలస్యమవడంతో సంజయ్ దత్, దర్శకుడు ఇందర్‌కుమార్ వచ్చి సముదాయిస్తే మళ్లీ మేకప్ వేసుకొంది.

# వైశాలిని చూడొచ్చు!



అల్లూరు రహీం

తన దగ్గర శిష్యులుగా పనిచేసిన వారితో తమిళంలో అగ్ర దర్శకుడు శంకర్ కొన్ని చిత్రాలు నిర్మిస్తాడు. దీనికోసం ఎస్ పిక్చర్ సంస్థను ఏర్పాటుచేసి వున్నాడు. తమిళంలో 'ఈరమ్' పేరిట నిర్మించిన చిత్రానికి తెలుగుసేత వైశాలి చిత్రం. లోబడ్జెట్ చిత్రమైన దీన్ని దర్శకుడు అరివళగన్ మంచి స్క్రీన్‌ప్లేతో రూపొందించాడు. కథ చిన్నదైనా కూడా దాన్ని సస్పెన్స్ థ్రిల్లర్‌గా మలచడంలో దర్శకుడు పడ్డ కష్టం తెరపై కనపడి పోతుంది. వెండితెరపై ప్రేక్షకులను భయపెట్టి కాసులు చేసుకొనే సూత్రానికి విరుద్ధంగా వైశాలిలో అందమైన ప్రేమకథ కూడా వుంది. ఈ ప్రేమకథ మొత్తం నెల్లూరు నేపథ్యంలో సాగుతుంది. టౌన్ బస్సులలో నడిచే ఈ కథలో నెల్లూరు నగరంలోని బస్టాపుల పేర్లను హీరోయిన్ చేత మాటల రచయిత చెప్పించాడు. చిత్రమంతా కారు మబ్బులు కమ్మి వర్షం కురుస్తున్న నేపథ్యంలో సాగుతుంది. ఈ వాతావరణాన్ని కెమెరామెన్ మనోజ్ కె.పరమహంస చక్కగా చిత్రీకరించాడు. సినిమా సన్నివేశాలన్నీ వైశాలి మరణం, ఆమె పాత ప్రేమ చుట్టూ నడిపిన తీరు బాగుంది. బస్టాపులలో, కాలేజి ప్రాంగణం, దేవాలయాల్లో ప్రేమను విస్తృతపరచిన తీరు హృదయాలను హత్తుకొంటుంది. కృష్ణచైతన్య వ్రాసిన కురిసే కురిసే వాన, జల్లేకురిసి, పురివిప్పిన నెమలి అందం చరణాలతోసాగే పాటలు భావస్ఫోరకంగా వున్నాయి. వీటికి థమన్ అందించిన సంగీతం వీనుల విందుగా వుంది. నెల్లూరీయుడు శశాంక్ వెన్నెలకంటి వ్రాసిన డైలాగుల్లో అమ్మ మీద నమ్మకం భార్యపై వుండాలి. బయటపడదనంత వరకు ఏదీ తప్పుకాదు. పంచ భూతాలను ఆత్మలు వశం చేసుకొంటాయి ఆలోచింపజేస్తాయి. సింధుమీనన్ మినహా పేరుగాంచిన నటీనటులెవ్వరూ ఈ చిత్రంలో లేకపోయినా దర్శకుడు నడిపిన కథా నైపుణ్యం మధ్య రెండున్నర గంటలు గడిచిన విషయమే తెలియదు. ఆ నైపుణ్యాన్ని చూసే దిల్‌రాజు ఈ చిత్రాన్ని తెలుగులో అనువదించినట్లున్నాడు.




ఇక చిత్రకథలోనికి వెళ్తే వ్యాపారవేత్త విశ్వనాధ్ భార్య వైశాలి(సింధుమీనన్). తాను నివసించే అపార్ట్‌మెంట్ బాత్రూంలోని నీటి తొట్టెలో శవమై తేలుతుంది. తన మరణానికి ఎవరూ కారణం కాదని మరణ వాంగ్మూలం కూడా వ్రాస్తుంది. ఆమె నడతపై కొన్ని అనుమానాలున్నందున ఈ కేసు ఫైల్‌ను మూసేయ్యమంటాడు పోలీసు కమిషనర్. కానీ ఈ కేసును శోధిస్తానంటాడు సిఐ వాసు(ఆది). ఆది పూర్వాశ్రమంలో వైశాలిని ప్రేమిస్తాడు. కానీ వారి పెళ్లికి వైశాలి తండ్రి సమ్మతించడు. దీంతో తండ్రి మాట కాదనలేక వైశాలి, విశ్వనాధ్‌ను పెళ్లి చేసుకొని వాసును మరచిపోతుంది. విశ్వనాధ్‌కు ఒకరోజు హోటల్‌లో క్లాస్‌మేట్ రేష్మ కనపడుతుంది. మొగుడు పద్ధతినచ్చక వేరే వాడితో సహజీవనం చేస్తున్నానంటుంది. అనుమానపు పురుగైన విశ్వనాధ్ ఇంటికి వెళ్లి వైశాలిని గతంలో ఎవరినైనా ప్రేమించావా అని అడుగుతాడు. ఆమె ప్రేమించింది వాస్తవమని, మర్చిపోయింది అంతే నిజమంటుంది. అపార్ట్‌మెంట్‌లో ఇరుగుపొరుగుగా వుండే కళ్యాణి కూతురు, కృష్ణమూర్తి చెడునడతతో వుంటారు. వాళ్లను వైశాలి మందలిస్తుంది. వాళ్లు ఆమెపై కక్ష పెంచుకొని విశ్వనాధ్‌తో నీ భార్యను కలవను ఎవరో వస్తున్నారని అబద్ధం చెబుతారు. దీంతో మతిగతితప్పిన విశ్వనాధ్ వైశాలిని నానామాటలని కాఫీలో విషం కలిపి చంపి నీటి తొట్టెలో వేస్తాడు. వైశాలి మరణం తర్వాత అపార్ట్‌మెంట్‌లో కృష్ణమూర్తి, కళ్యాణి, వాచ్‌మెన్, కళ్యాణి కుమార్తె ప్రియుని హత్యలు వరుసగా జరగడం సంచలనం సృష్టిస్తుంది. దర్యాప్తు అధికారి వాసు ఇదేదో అతీతశక్తి వల్ల జరుగుతుందని ఊహిస్తాడు. అతను ఆత్మల విషయమై ఆరాతీస్తుండగా వైశాలి తన చెల్లెలు దివ్య(శరణ్యామోహన్) శరీరంలోకి వచ్చి అన్నీ చెప్పేస్తుంది. చివరన తన భర్త చేత తానే తన భార్యను హత్యచేసానని చెప్పేలా చేస్తుంది. దీంతో వాసు అతన్ని అరెస్ట్ చేయడంతో చిత్రం ముగుస్తుంది.

## వైఎస్ఆర్ కాంగ్రెస్‌ను బలోపేతం చేస్తా!



విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని గ్రామస్థాయి నుంచి బలోపేతం చేయడానికి కృషిచేస్తానని ఆ పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి స్పష్టం చేశారు. కన్వీనర్‌గా నియమితుడయ్యాక 29వ తేది నెల్లూరు వచ్చిన ఆయన విలేకరులతో మాట్లాడారు. వైఎస్ జగన్మోహన్ రెడ్డి తనపై నమ్మకంతో అప్పగించిన బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తానన్నారు. తాను పదవులను ఆశించి రాజకీయాల్లోకి రాలేదని కేవలం ప్రజలకు సేవచేయాలనే ధృఢ్ధతో రాజకీయాల్లో ప్రవేశించానన్నారు. కొత్త పార్టీ కోసం పనిచేసే వారందరికీ గుర్తింపు వుంటుందన్నారు. ఎన్నికలంటే కాంగ్రెస్, టిడిపి పార్టీల వెన్నుల్లో వణుకు పుడుతుందని, దీనికి కారణం కడప ఉప ఎన్నికల్లో తమ పార్టీ సత్తా చూపించడమేనన్నారు. వీగిపోతుందనే భయంతోనే తెలుగుదేశం పార్టీ కిరణ్‌కుమార్‌రెడ్డి సర్కారుపై అవిశ్వాసం పెట్టడానికి భయపడుతుందన్నారు. వైఎస్సార్ పార్టీ ప్రభంజనానికి అసూయపడి అధికార పార్టీ ప్రజాప్రతినిధులు సైతం అభివృద్ధి కార్యక్రమాలను అడ్డుకొంటున్నారని విమర్శించారు. అభివృద్ధిని అడ్డుకుంటే సహించేది లేదన్నారు. అధికారంలో వున్నా లేకున్నా ప్రజా సమస్యల సాధనకు తనవంతు కృషి చేస్తానన్నారు. ఈ సమావేశంలో మాజీ ఎమ్మెల్యే నెలవల సుబ్రహ్మణ్యం, ఎల్లసిరి గోపాల్‌రెడ్డి, రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, నేదురుమల్లి పద్మనాభరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## స్థానిక ఎన్నికలకు అధికారుల కసరత్తు!



జడ్పీ మీటింగ్ హాల్‌లో రాజకీయ పార్టీలతో ఏర్పాటుచేసిన సమావేశంలో మాట్లాడుతున్న కలెక్టర్, డిఆర్వో.

స్థానిక సంస్థల ఎన్నికలకు సంబంధించి అధికారులు కసరత్తు ప్రారంభించారు. పోలింగ్ కేంద్రాల ఏర్పాటు అభ్యంతరాలపై జిల్లా కలెక్టర్ శ్రీధర్ అన్ని రాజకీయపక్షాలతో జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో సమీక్ష జరిపారు. అధికారులు చురుకుగా వ్యవహరిస్తున్నా ప్రధాన రాజకీయ పార్టీల్లో మాత్రం స్పందన కరువవుతోంది. మొత్తం జిల్లావ్యాప్తంగా ఈ ఎన్నికలకు సంబంధించి 2029 పోలింగ్ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు. ప్రతి వెయ్యి మందికి ఒక పోలింగ్ కేంద్రం వుండాలని భావించి ఈ నిర్ణయం తీసుకొన్నామన్నారు. ఓటు చేసేందుకు ఎక్కువ దూరం ప్రయాణించి రావాల్సిన వారికి ఇబ్బంది కలుగకుండా వుండేందుకు అన్ని చర్యలు చేపడుతున్నామన్నారు. ఓటర్ల జాబితాలో మార్పులు చేర్పులకు అవకాశం వుందని, క్రొత్త ఓటర్ల దరఖాస్తుకు షెడ్యూల్ ప్రకటించే వరకు చేసుకోవచ్చన్నారు. స్థానిక సంస్థలు ఎన్నికల్లో బ్యాలెట్ పేపర్ వినియోగిస్తారో, లేక ఇవిఎంలు వుంటాయో అనే దానిపై ఎన్నికల సంఘం నుంచి స్పష్టమైన ఆదేశాలు రావాల్సి వుందన్నారు. జూన్ 23కి ప్రస్తుతం స్థానిక సంస్థల పదవీకాలం ముగియనుండడంతో 46 జడ్పీటీసి, 599 ఎమ్పీటీసీ పదవులకు ఎన్నికలు నిర్వహించాల్సి వుంది.

# కాకుటూరు క్రాస్‌రోడ్డులో తిష్టవేసిన మృత్యుదేవత!

### ● ఐదు నెలల్లో 50 మంది ప్రాణాలు పోయాయి



28వ తేది జరిగిన ప్రమాదంలో రెండు కార్లు ఢీకొన్న దృశ్యం.

శాస్త్ర సాంకేతికంగా సమాజం ఎంత పురోభివృద్ధి సాధించినా కొన్నిసార్లు జరిగే వరుస సంఘటనలు మనల్ని ఆలోచింపజేస్తాయి. జాతీయ రహదారిపై కాకుటూరు క్రాస్‌రోడ్డు జంక్షన్‌లో ఈ యేడాది ఒకే ప్రాంతంలో జరిగిన వరుస రోడ్డు ప్రమాదాల్లో 50 మంది మరణించడం చూస్తుంటే ఇక్కడ మృత్యుదేవత మాటువేసి కూర్చొని వుందా అనే అనుమానం కల్గకమానదు. 23, 28 తేదీల్లో ఈ రోడ్డు జంక్షన్‌లో జరిగిన వరుస రోడ్డు ప్రమాదాల్లో 11 మంది ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి. 23వ తేది విశాఖపట్నం నుంచి చెన్నై వెళ్తున్న గరుడ ఆర్టీసి బస్సు ఇసుక టిప్పర్‌ను ఢీకొన్న సంఘటనలో నలుగురు మరణించగా 13 మంది గాయపడ్డారు. 28వ తేది ఈ ప్రాంతంలో జరిగిన రోడ్డు ప్రమాదం మరీ విచిత్రంగా జరిగింది. గూడూరు నుంచి నెల్లూరు వైపు వస్తున్న డాక్టర్ రాజేంద్రప్రసాద్ కారు పంక్చర్ అయ్యి డివైడర్ ఎక్కి చెన్నై వైపు వెళ్తున్న కారును ఢీకొట్టింది. ఈ ప్రమాదంలో డాక్టర్ రాజేంద్రకుమార్, పిల్లలు అరవింద్, కార్తికేయ మరణించారు. రాజేంద్రప్రసాద్ గూడూరులో ఓ మిత్రుని గృహప్రవేశానికి వచ్చి తిరిగి వెళ్తుండగా ఈ ప్రమాదం జరిగింది. రాజేంద్రప్రసాద్ గూడూరులో కారు ఎక్కించుకొన్న ఆయన చిననాటి మిత్రుడు గోపాల్‌ను కూడా మృత్యు దేవత వదలలేదు. రాజేంద్రప్రసాద్ కారు నారాయణ స్వామి కారును ఢీ కొట్టిన సమయంలో మంటలు కూడా రేగాయి. నెల్లూరు లెక్చరర్ కాలనీకి చెందిన నారాయణ స్వామి ఆరోగ్యం బాగోలేక చెన్నై వెళ్తుండగా మృత్యువు అక్కడ వరకు పోనివ్వకుండా మధ్యలో మ్రింగి వేసింది. ఈ సంఘటనలో ఆయన సతీమణి విజయలక్ష్మి, కారు డ్రైవర్ బుచ్చికి చెందిన అలీ కూడా మరణించాడు. ఈ జంక్షన్‌లో జరుగుతున్న ప్రమాదాలు చూడను గుండె దిటవుగల మనుషులు కూడా దంగై పోవాల్సిందే. ఇక్కడి ప్రమాదాలకు కారణాలను ఎవరైనా పరిశోధించి చెబితే బాగుంటుంది.



బదలీ అయిన ఎస్పీ దామోదర్.

## గబ్బుపట్టిపోయిన ఎస్పీ!

జిల్లా ఎస్పీ దామోదర్ బదలీ అయ్యాడు. ఏడాది క్రిందట జిల్లాలో బాధ్యతలు చేపట్టిన ఆయన తొలుత ట్రాఫిక్ చక్కదిద్దేందుకు చేసిన యత్నాలు మంచి పేరు సంపాదించి పెట్టినా తర్వాత కాలంలో అపఖ్యాతి మూటగట్టుకొన్నాడు. మద్రాస్ బస్టాండ్ వద్ద కూరలు అమ్ముకొనే వారి పట్ల ఆయన వ్యవహరించిన తీరు విమర్శలపాలయ్యింది. దీనికితోడు పోలీసుల బదలీలు తదితర అంశాలలో ఆయన పెద్ద ఎత్తున అవినీతికి పాల్పడినట్లు ఆరోపణలు వెల్లువెత్తాయి. మద్యం వ్యాపారుల వద్ద నుంచి ముడుపులు అందుకొంటూ వేళలు పాటించకపోయినా చూసీచూడనట్లు వ్యవహరించడం, హైవే స్టేషన్లలో పోస్టింగులకు లక్షల రూపాయలు ధర నిర్ణయించి ఇవ్వడం, డిఎస్పీలను దండకాలకు ప్రోత్సహించడం లాంటి ఆరోపణలు అధికం అయ్యాయి. మొత్తం మీద గతంలో పనిచేసిన ఎస్పీలకంటే బదలీలు తదితర విషయాల్లో అవినీతిపరుడిగా పేరుబడ్డాడు. ఆయన స్థానంలో క్రొత్తగా వస్తున్న రమణకుమార్ నెల్లూరుకు పాతకాపే. గతంలో గూడూరు, నెల్లూరు రూరల్ తొలి డిఎస్పీగా పనిచేసి వున్నాడు. టిటిడి విజిలెన్స్ విభాగంలో పనిచేస్తూ డాలర్ల కుంభకోణాన్ని బయటపెట్టి సంచలనం సృష్టించాడు. రమణకుమార్ వచ్చిన నాటి నుంచైనా పోలీస్ పనితీరు మెరుగుపరచడంతోపాటు గాడితప్పిన పోలీస్ వ్యవస్థను సక్రమమార్గంలో పెడతాడేమో చూడాలి.

## ధర్మల్‌పై పోరుబాటే!

**జనవిజ్ఞాన వేదిక ప్రతిన**

పర్యావరణానికి, ప్రజల ఆరోగ్యానికి ముప్పు కల్గించే ధర్మల్ విద్యుత్ కేంద్రాల ఏర్పాటుపై జనవిజ్ఞాన వేదిక సమర శంఖం పూరించింది. ప్రజలను జాగ్రుతం చేసి వీటికి వ్యతిరేకంగా పోరాటాన్ని కొనసాగిస్తామని వేదిక పిలుపు నిచ్చింది. నగరంలో ధర్మల్ విద్యుత్ కేంద్రాలకు వ్యతిరేకంగా నిర్వహించిన సభలో జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర అధ్యక్షుడు బివిరెడ్డి, శాసన మండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యం తదితరులు మాట్లాడారు. జిల్లాలో తీరప్రాంత మండలాల్లో ఏర్పాటవుతున్న ధర్మల్ విద్యుత్ కేంద్రాల వలన పర్యావరణానికి తీవ్ర విఘాతం కల్గుతుందని ఆందోళన వ్యక్తం చేశారు. రోజుకు కొన్ని లక్షల టన్నుల బొగ్గు కాల్చి దాని ద్వారా విద్యుత్ ఉత్పాదన చేస్తారన్నారు. ఈ కారణంగా కాలుష్యం పెరిగి పోతుందని, కొన్ని కిలోమీటర్ల మేర వ్యాపిస్తుందని హెచ్చరించారు. శ్రీకాకుళం జిల్లాలో వచ్చిన చైతన్యం ఇక్కడి ప్రజల్లో వచ్చి ఆ స్థాయిలో పోరాటం చేస్తేనే దీనిని ఎదుర్కోగలమన్నారు. ప్రజలకు మేలు జరిగే వరకు పోరాటాన్ని ఆపేది లేదని స్పష్టం చేశారు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

నందకుమార్ చెప్పారు. వీటిలో పంచాయితీలు 24 కోట్లు, నెల్లూరు కార్పొరేషన్ నాలుగు కోట్లు, కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాలిటీలు ఐదు కోట్లు, వివిధ ప్రభుత్వ విభాగాలు 11 కోట్ల రూపాయలు బకాయిలు చెల్లించాల్సి వుందన్నారు.

## రత్నం కాలేజిలో మెరుగైన ఫలితాలు!

గత ఏడాది నెల్లూరు హరనాధ పురంలో డాక్టర్ సత్యనారాయణ నేతృ త్వంలో ప్రారంభించిన రత్నం జూనియర్ కాలేజి విద్యార్థులు ఇటు ఎమ్పీసి, అటు బైపిసి గ్రూప్‌లోనూ రాష్ట్రస్థాయిలో అత్యుత్తమ మార్కులు సాధించారు. ఎమ్పీసి విభాగంలో జి.ప్రవీణ్‌కుమార్ 460, వివి కార్తికేయ, ఎం.వాసు నాయుడు, ఎన్.ఎస్.భానుప్రకాష్ 459, కె.సాయి ప్రభాత్ 458, జి.తేజ 455 మార్కులు తెచ్చుకొన్నారు. బైపిసిలో ఎమ్.పి.శ్రీవాణి 426, పి.కమల నయని 425, ఎస్.అరవింద్, కె.సాయిలక్ష్మి 424, ఎస్.మశ్విత 423, వి.సాయిస్వరూపరెడ్డి, డి.భావన, వై.గురురవితేజ, ఎ.సౌమ్య 422 మార్కులు తెచ్చుకొన్నారు. బైపిసిలో డైరక్టర్స్ బ్యాచ్, ఎఐఇఇఇ, బైపిసి ఎసి క్యాంపస్‌లు, బైపిసి ఎంసెట్, ఎమ్పీసి ఐఐటి, ఎమ్పీసి ఎఐఇఇఇ, ఎమ్పీసి ఎంసెట్ ఇంటెన్సివ్ కోచింగ్ కూడా ఇస్తున్నారు. జి.కృష్ణమోహన్ ఈ జూనియర్ కాలేజికి అకడమిక్ డీన్‌గా వ్యవహరిస్తున్నారు.

## చంద్రారెడ్డి డిగ్రీ కాలేజి విద్యార్థుల హవా!

ఈ వారంలో ప్రకటించిన డిగ్రీ తృతీయ సంవత్సరం ఫలితాల్లో నెల్లూరు చంద్రారెడ్డి డిగ్రీ కాలేజి విద్యార్థులు మార్కుల మోత మోగించారు. ఎం.ఎస్.సి.ఎస్ గ్రూపులో పి.సాయి స్విర్ణ 93శాతం మార్కులతో ప్రథమ స్థానంలో నిలిచింది. కె.అనూష 92శాతం, టి.ఈశ్వరమ్మ 91శాతం, సుకన్య 91 శాతం, ఆర్.మోసెస్ 90శాతం మార్కులు తెచ్చుకొన్నారు. ఎం.ఇ.సి.ఎస్ గ్రూపులో ఎస్.శ్రీదేవి 90శాతం మార్కులు సాధించింది. కె.విజయరాజు బికాం కంప్యూటర్ గ్రూప్‌లో 84.7శాతం, ఎన్.సురేష్ బయోటెక్నాలజీ గ్రూప్‌లో 80.3శాతం మార్కులు సాధించారు. అద్భుతమైన మార్కులు సాధించిన విద్యార్థినీ విద్యార్థులను కరస్పాండెంట్ కె.ప్రతాప్‌రెడ్డి, ప్రిన్సిపల్ అభినందించారు.

## మేక మెడలా కోసాడు!

మనిషి మెడకు మేక మెడకు తేడా లేదని చాటి చెప్పాడు ఓ కసాయి. నెల్లూరు సంతపేట మార్కెట్‌లోని ఖాజా మటన్ స్టాల్‌లో పనిచేసే సహాయకులు బర్నా, రాజాలు రోజు విడిచి రోజు విధులకు హాజరు కావాలి. 27వ తేది ఇద్దరూ వచ్చేశారు. విధి నిర్వహణపై ఇద్దరి మధ్య వాగ్వివాదం జరిగింది. అంతే రాజా మెడను బర్నా మేక మెడలా మాంసం కోసే కత్తితో కోసేశాడు. తీవ్ర రక్తస్రావం మధ్య రాజాను పెద్దాసుపత్రికి తరలించారు.

## ఐటిడిఏ పిఓ బదలీ

పనిచేసింది స్వల్పకాలమైనా నిరంతరం వార్తలలో వుండిన ఐటిడిఏ ప్రాజెక్ట్ ఆఫీసర్ కె.రమేష్ ఎట్టకేలకు బదలీ అయ్యారు. ఆయన్ను శ్రీశైలం ఐటిడిఏ ప్రాజెక్ట్ ఆఫీసరుగా నియమించారు. నెల్లూరుకు వచ్చే కొత్త అధికారి పేరు ఇంకా తెలియ రాలేదు.

## ఆదాయపు బాటలో బిఎస్ఎన్ఎల్!

గత ఏడాదికంటే ఈ యేడాది బిఎస్ఎన్ఎల్ ఆదాయం పది కోట్ల రూపాయలు పెరిగిందని జిఎం జి.గోపి చెప్పారు. టెలికాం అడ్వయిజరీ కమిటీ సభ్యుల సమావేశంలో ఈ వివరాలు వెల్లడిం చారు. నిర్వహణ ఆదాయంలో దేశంలోనే నెల్లూరు శాఖ ప్రథమ స్థానంలో వుందన్నారు. ఈ సమావేశంలో డిజిఎం ప్రసాదరావు, ఏజిఎం మార్కొండారెడ్డి పాల్గొన్నారు.

## ఎన్టీఆర్ జయంతి

ఎన్టీఆర్ జయంతిని పురస్కరించుకొని నెల్లూరులోని కాకతీయ సేవాసమితి వాత్సల్య అనాధ ఆశ్రమంలోని పిల్లలకు పుస్తకాలు, జామెట్రీ బాక్సులు, బిస్కెట్లు, పండ్లు పంచి పెట్టారు. ఈ కార్యక్రమంలో కాకతీయ సేవాసమితి అధ్యక్షులు రావి మోహన్‌చౌదరి, కార్యదర్శి మక్కెన అంకయ్య చౌదరి, లగడపాటి హరిప్రసాద్, సూరవనేని లక్ష్మయ్య నాయుడు, వాత్సల్య గౌరవాధ్యక్షులు సామంతు గోపాలరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## అన్నదానం

అపోలో డెంటల్ హాస్పిటల్స్ గ్రూపు మాజీ మేనేజింగ్ డైరక్టర్ డాక్టర్ యర్రంరెడ్డి ప్రసాద్‌రెడ్డి ద్వితీయ వర్ధంతిని పురస్కరించుకొని 3తేది బృందావనంలో అన్నదాన కార్యక్రమాన్ని ఏర్పాటు చేసినట్లు ప్రముఖ దంత వైద్యులు డాక్టర్ జి.కొండారెడ్డి తెలిపారు. బృందావనం మిత్ర మండలి నేతృత్వంలో ఈ కార్యక్రమం జరుగుతుంది.

## స్టేడియాన్ని తనిఖీ చేసిన కలెక్టర్

ఎసి స్టేడియంలో జరుగుతున్న పనులు, తదితర అంశాలపై వ్యక్తమవుతున్న ఆరోపణలు, విమర్శలకు స్పందించిన కలెక్టర్ శ్రీధర్ 31వ తేది ఆకస్మిక తనిఖీ చేశారు. ఎలాంటి ముందస్తు సమాచారం లేకుండా వెళ్లిన ఆయన స్టేడియంలో ప్రతి గదిని పరిశీలించారు. క్రీడాకారులకు అందుతున్న శిక్షణ, స్విమ్మింగ్‌పూల్, నిర్మాణ పనులను అన్నింటినీ పరిశీలించారు. కలెక్టర్ వచ్చిన విషయాన్ని ఆలస్యంగా తెలుసుకొన్న డిఎస్‌డిఓ చెమటలు కక్కుతూ వచ్చి అంతా బాగానే వుంది అని నమ్మించే ప్రయత్నం చేసినా కలెక్టర్ విన్పించుకోకుండా గంటకుపైగా అక్కడ గడపడం అధికారులకు చెమటలు పట్టించింది.

## థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులపై విచారణ

జిల్లాలోని తీరప్రాంత మండలాల్లో ఏర్పాటవుతున్న థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్‌లపై సర్వత్రా నిరసన వ్యక్తమవుతున్న తరుణంలో విజిలెన్సు అధికారులు వీటిపై విచారణ చేపట్టారు. ప్రభుత్వం నుంచి తగిన ఆదేశాలు రావడంతో విజిలెన్సు ఎస్పీ మోహన్‌రావు ఆధ్వర్యంలో అధికారులు ప్రాజెక్టుల ఏర్పాటు, వాటి నుంచి వెలువడే కాలుష్యంపై విచారణ జరిపి నివేదిక ఇవ్వనున్నట్లు సమాచారం.



డిగ్రీ పరీక్షా ఫలితాలలో అత్యధిక మార్కులు తెచ్చుకొన్న శ్రీచంద్రారెడ్డి డిగ్రీ కాలేజీ విద్యార్థినీ, విద్యార్థులను అభినందిస్తున్న కరస్పాండెంట్ కె.ప్రతాప్‌రెడ్డి.

## ఎన్టీఆర్ జయంతి వేడుకలు

తెలుగుదేశం పార్టీ వ్యవస్థాపక అధ్యక్షుడు, ప్రఖ్యాత సినీ హీరో ఎన్టీ రామారావు 89వ జయంతి వేడుకలను టిడిపి నేతలు ఘనంగా నిర్వహించారు. సోమిరెడ్డి, బీద, రమేష్‌రెడ్డి తదితర సీనియర్ నేతలు మహానాడు కార్యక్రమానికి హాజరైన పుటికీ కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఆధ్వర్యంలో ఘనంగా నిర్వహించారు. నర్తకి సెంటర్‌లోని ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలవేసి నివాళులు అర్పించారు.

## నిలచిన చెల్లింపులు

ఖజానాలపై ప్రభుత్వం నిషేధం విధించడంతో కోట్ల రూపాయల చెల్లింపులు నిలచిపోయాయి. కేవలం పెన్షన్లు, జీతాలను మాత్రమే చెల్లించి మిగతా వాటిని నిలుపుదల చేయడంతో దాదాపు వంద కోట్ల రూపాయల చెల్లింపులు ఆగిపోయాయి. అసలే కంప్యూటర్లు మొరాయిస్తూ అస్తుబిస్తుగా వున్న ట్రెజరీలో వీటిని సరిదిద్దకుండా పులి మీద పుట్రలా ప్రభుత్వం ఈ మేరకు ఆదేశాలివ్వడంతో 27వ తేది నుంచి ఇవి ఆగిపోయాయి.

## అవిశ్వాస ప్రయత్నం అభాసుపాలే

మొదటి పేజీ కొరవ

నిముషంలో పడి పోతుందని ఉత్తరకుమార ప్రతిజ్ఞలు చేశాడు. ఆ వెంటనే, తెలుగుదేశం అవిశ్వాసం పెడితే తాను ప్రభుత్వాన్ని కూలగొడతానని సవాలు విసిరాడు. తెలుగుదేశం కాంగ్రెస్ పార్టీలు కుమ్మక్కైపోయాయని ప్రజలను నమ్మించగలిగితే, రేపటి ఎన్నికలలో ప్రభుత్వ వ్యతిరేకత ఓటు మొత్తం తనకే దక్కి, కడప ఉప ఎన్నికల వలె అన్ని నియోజక వర్గాలలో భారీ మెజార్టీతో విజయం లభిస్తుందని భ్రమపడడం జగన్ చేసిన పొరపాటు.

ఇప్పుడు అవిశ్వాసానికి తెలుగుదేశం సిద్ధంగా వుంది. మీకెందుకంత శ్రమ, నేనే నా మీద విశ్వాస తీర్మానం పెట్టుకొంటాను, దమ్ముంటే ఓడించండని సవాలు విసురుతున్నాడు ముఖ్యమంత్రి కిరణ్ కుమార్ రెడ్డి. ఆ పరిస్థితే వస్తే జగన్‌కు భంగపాటు తప్పదు. అవిశ్వాస తీర్మానం పెట్టినా, దానికి తెలుగుదేశం మద్దతు ఇచ్చినా ప్రభుత్వాన్ని ఎందువల్ల పడగొట్టలేక పోయిందీ ఆయన ప్రజలకు వివరణ ఇచ్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. జగన్ బలహీనత గమనించిన కిరణ్‌కుమార్ రెడ్డి రెట్టించిన ఉత్సాహంతో విశ్వాస తీర్మానానికి రంగం సిద్ధం చేస్తున్నాడిప్పుడు.

## జనవాణి

2వ పేజీ కొరవ

కరరాజు చేతులమీదుగా ఆరాధన జరుపబడింది. అది ఒక భక్తుని చేత చేయించి వుంటే బాగుందేదని వ్రాశారు. బాబా వారికి కోటి మంది భక్తులున్నారు. ఎవరిచేత చేయించాలి. లేదా ఒక సామాన్యుని చేత చేయించాలని వ్రాశారు. ఆ సామాన్యుడు ఎవరు? రాజమండ్రి నుంచి పిలిపించిన వేదపండితులు ఇచ్చిన సలహా మేరకు ఒక సన్యాసికి ఆరాధన ఏవిధంగా చేయాలో ఆవిధంగా రత్నాకర రాజు చేత చేయించారు. ఎవరూ లేని సన్యాసులకు, పీఠాధిపతులకు వారి శిష్యులు చేస్తారు. కాని ఇక్కడ రత్నాకరరాజు వున్నారు. ఈ వ్యవహారంలో వాగ్వివాదాలకు తావులేదు.

పి.ఆదిలక్ష్మి నెల్లూరు

## విద్యుత్‌శాఖ వేధింపు!

కరెంటు మీటరు రీడింగు తీసేవారు, మీటర్లు బయట అమర్చాలని గట్టిగా చెబుతున్నారు. ఇళ్ల యజమానులు ఇంట్లో వున్నా లేకపోయినా మీటర్ల రక్షణ కోసం లోపల అమర్చడం చేశారు. ఇప్పుడు వాటిని బయట అమర్చాలంటే చోటు లేకపోవడం, ఆర్థికంగా ఖర్చుతో కూడుకున్న వ్యవహారంతోపాటు రక్షణ వుండదు. ఈ వ్యవహారంలో విద్యుత్ శాఖ మొండి వైఖరి ఎందుకు అవలంభిస్తున్నదో అర్థం కావడం లేదు. మీటర్లు బయటనే వుంచాలన్న నిబంధన నుంచి పాత ఇళ్లను మినహాయించి కొత్త ఇళ్లకు మాత్రమే అనువర్తింప జేస్తే బాగుంటుంది.

డి.మాల్యాద్రి దగదర్తి

## కొత్త ఎస్పీ పోస్టింగ్

మొదటి పేజీ కొరవ

ఇక్కడ పోస్టింగ్ సంపాదించాడు. నెల్లూరుజిల్లా ఎస్పీ నియామకం జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రమేయం లేకుండా జరగడం విశేష మనుకొంటే, విశేషమే.

# ఆతుకూరి మొల్ల నివాసం నెల్లూరు జిల్లా గోపవరం!

## ● ఆధారాలు చారిత్రకం, నిర్ధారణలు హేతుబద్ధం!!

**పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**

*అఖిల భారత చరిత్ర పురావస్తు రచయితల సంఘం కార్యవర్గ సభ్యుడు.*

ఆతుకూరి మొల్ల నివాస స్థలం నెల్లూరు జిల్లా కలువాయి మండలం, గోపవరం. గోపవరం గ్రామానికి అయిదారు వందల ఏళ్ల చరిత్ర వుంది. గోపవరం శివారులోని శ్రీకంఠమల్లేశ్వరాలయం మొల్ల (క్రీ.శ 1484–1553)కాలానికి పూర్వానిది. మొల్ల తండ్రి కేసనసెట్టి కుమ్మరి కులజుడు. వర్ణాశ్రమ ధర్మాల్ని తూర్పారబట్టిన తీవ్రవాద శైవం గురుస్థాయి కేసనది.

కేసనను గురించి మొల్ల ఇలా అంటుంది.

**గురులింగ జంగమార్చన**
**పరుడు శివభక్తిరతుడు బాంధవహితుడున్**
**గురుడు ఆతుకూరి కేసన**
**వరపుత్రిని మొల్లయనగ వరలినదానిన్**

తీవ్రవాదశైవంలో గండ కత్తెరలు వేసుకోవడం, శిరఃఖండన చేసుకోవడం వంటి చర్యలు అప్పట్లో సర్వసాధారణం. అలాంటి స్మృతి చిహ్నాలైన శిల్పాల్ని 'వీరగల్లులు' అంటారు.

గోపవరం, వెదనపర్తి మధ్యలోని కీర్తి శేషులు వెన్నపూస నారసింహారెడ్డి పొల్లాల్లో మనకీ శిల్పాలు కనిపిస్తాయి.

**శ్రీకంఠమల్లేశ్వరాలయంలో రామాయణం!**

మొల్ల తన రామాయణాన్ని శ్రీకంఠమల్లేశ్వరాలయంలోనే రాసింది. ఆలయంలోని శివుడికి శ్రీకంఠమల్లేశ్వరుడనే పేరు రావడానికి కొన్ని చారిత్రక కారణాలున్నాయి.

ఆలయం ప్రక్క ప్రవహించే వాగు పేరు 'నల్లవాగు'. ఆలయానికి దక్షిణ దిశలోని చెరువు పేరు 'నల్లచెరువు'. అందువల్ల మల్లేశ్వరుడు కూడా నల్లని కంఠముగల మల్లేశ్వరుడైనాడు.

ఆమె కవిత్వం కూడా శ్రీకంఠమల్లేశ్వరుని వరం చేత చెప్పగలిగిందట. ఈ విషయాన్ని ఆమే స్వయంగా రాసుకుంది.

**"... .... ..... విఖ్యాత**
**గోపవరపు శ్రీకంఠమల్లేశ్వరము చేత**
**నెఱిగవిత్వము జెప్పగా నేర్చుకొంటి"**

అని ఘంటాపథంగా చెబుతుంది. 15, 16 శతాబ్దాలలో శ్రీకంఠమల్లేశ్వరాలయం చాలా సుప్రసిద్ధమై వుండేది. అక్కడి గ్రామదేవత మల్లమ్మ. అయిదారు వందల సంవత్సరాల క్రితం నుంచి ఇక్కడొక మహా వేపవృక్షం మల్లమ్మ మానుగా పూజలందుకొంటోంది.

మొల్లకు మల్లి, మల్లమ్మ అని నామధేయాలున్నట్లు... అవి మల్లేశ్వరుడు వల్లనో, గ్రామ దేవతల వల్లనో ఏర్పడినవే అంటారు గ్రామస్థులు.

ఇప్పటి లలితానగర్, పెద్దగోపవరం, చిన్న గోపవరం ప్రాంతాలకు ఒక కిలోమీటరు దూరంలోని పాటిచేలు, తోటల ప్రాంతంలో శిథిలమైన గోపవరం స్థానే క్రమేపీ పెద్ద, చిన్న, కెసి గోపవరాలు ఏర్పడ్డాయి.



**ఆ గోపవరాలకు చరిత్ర లేదు!**

తెలంగాణాలో, కర్నూలు, కడప జిల్లాలలో కూడా గోపవరాలున్నాయి. కానీ ఆ గోపవరాలకు రెవిన్యూ రికార్డులలో వంద సంవత్సరాలకు మించిన చరిత్ర లేదు.

మొల్ల(పాకనాడు వారైనా) తిక్కన, శ్రీనాథులను తన కవిస్తుతిలో పేర్కొంటుంది. నెల్లూరు జిల్లాలోని గండవరం, దువ్వూరు, బుచ్చి గ్రామాలు పంటరెడ్ల జన్మస్థావరాలు. వీరు ఇక్కడ నుంచే కొండవీడు, అద్దంకి రాజ్యాలలో రాజ్య ప్రముఖులుగా చేరారు. మొల్ల పంట రెడ్లను ఇలా ప్రస్తావిస్తుంది.

**"పంటల భాగ్యము గలరై**
**బంటల పై బంటల మర బ్రతుకుదురెపుడున్**
**పంటలు బాడియుగలయా**
**పంటలు మొదలైన కాపు ప్రజలానగరిన్"**

పంట రెడ్లు నెల్లూరు వారని సురవరం ప్రతాపరెడ్డి గారు శాసనాధారాలతో నిరూపించి వున్నారు.

నెల్లూరీయుడైన శ్రీనాథుణ్ని మొల్ల ప్రస్తావిస్తే శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలో పంట రెడ్లను ఇలా ప్రస్తావిస్తాడు.

**"పంట మహా స్వయంబు పాకనాడు (నెల్లూరి సీమ)**
**దేశంబున భద్ర పీఠంబునధివశించి,**
**సింహ విక్రమ(నెల్లూరు) దువ్వూరు, గండవరాది పట్టణంబుల**
**నిజనివాసములుగా....."**

–భీమేశ్వర పురాణం

ఒకప్పుడు నెల్లూరుపైకి శత్రురాజు దండెత్తాడు. కేసనసెట్టి రాత్రికి రాత్రి వేల మట్టి సైనికుల్ని చేసి నిలిపాడు. శత్రువులు గుట్టపై నుంచి ఆ అశేష సైన్యాలను చూసి పారిపోయారు.

– నెల్లూరు గ్రామ కవిత కట్టలు
(గ్రామ చరిత్రలు)

**ఎన్నో ఆధారాలు**

ఆంధ్ర కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు వ్రాసిన ఆరుద్ర, వీరేశలింగం, ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ ఆదిగా గల ప్రముఖులు మొల్ల నివాసం నెల్లూరు జిల్లా గోపవరమని స్పష్టం చేశారు.

సుప్రసిద్ధ సాహితీ సంస్థలు ప్రచురించిన గ్రంథాల్లో కూడా ఈ ప్రస్తావనలే వున్నాయి చూడండి.

"ఈ కవయిత్రి నివాసం నెల్లూరు జిల్లా గోపవరం. ఈమె 16వ శతాబ్ది ప్రథమార్థంలో వున్నట్లు తెలుస్తున్నది"

–వావిళ్ల(1917).

"ఈమె నెల్లూరు సమీపంలోని గోపవరం వాసి. ఆతుకూరి కేసనసెట్టి పుత్రిక"

–ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం
(ఆరవ సంపుటి – 1963).

"ఈమె నెల్లూరు మండలం గోపవరం గ్రామ వాసిని. 16వ శతాబ్ది పూర్వార్థంలో జీవించింది"

– నెల్లూరు మండల సర్వస్వం (1963).

"మొల్ల నెల్లూరు మండలం గోపవరం వాసి. చాలా రామాయణాల కంటే ఈమె రామాయణం ఉత్కృష్టమైనది.

– ఆంధ్ర వాఙ్మయం సర్వస్వం (1967).

"ఈమె జన్మస్థలం నెల్లూరు మండలంలోని గోపవరం".

– తెలుగు విజ్ఞాన సర్వస్వం
(తె.వి.విద్యాలయం హైదరాబాద్).

"మొల్ల నెల్లూరు మండలం గోపవరం వాసి. అని తేలుతున్నది".

–ఆం.ప్ర.సా.అ.ప్రతి (1967). ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ.

ఇట్లా చరిత్ర నేపథ్యాలు, చరిత్ర ఆధారాలు మొల్ల నెల్లూరు జిల్లా కలువాయి మండలం, గోపవరం గ్రామస్థురాలుగా చెబుతుండగా కొందరు అత్యాశాపరులైన ప్రక్క జిల్లా సాహిత్య మిత్రులు ఆమె విగ్రహం ప్రతిష్టించుకొని, పంచశతి ఉత్సవాలు జరుపుకోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది.

**ఈ ధోరణి ఏమిటి?**

ఆతుకూరి మొల్ల ఏ ప్రాంతం కవయిత్రి అయినా రామాయణ మహాకావ్యాల్లోని ఉత్కృష్టమూ, అనితర సాధ్యమైన రామాయణాన్ని రాసింది కాబట్టి ఆమెను అలా గౌరవించాం అంటే మాకభ్యంతరం లేదు కానీ, పోతనలాగా చాటింపు వేయించుకొని భంగపడిన తీరుగా ఇతరత్రా దురుద్దేశాలతో అలా చేసి వుంటే మాత్రం భంగపాటు తప్పదు. ఆశ ఉండవచ్చు. అత్యాశ పనికిరాదు. అతిశయోక్తుల కట్టు కథలు, అసలు పనికిరావు. ప్రక్క జిల్లాల సాహిత్య చరిత్రలపై దాడి అసలు పనికిరాదు. ఈ విధానం అభిలషణీయం కూడా కాదు. తిరస్కరింపదగినది.

(నెల్లూరు జిల్లా కలువాయి మండలం గోపవరం నివాసస్థురాలు మహా కవయిత్రి ఆతుకూరి మొల్లను కడప జిల్లా బద్వేలు మండలం గోపవరం వాసిగా ప్రకటిస్తూ విగ్రహ ప్రతిష్ట మరియు పంచశత ఉత్సవాల జరుపుకున్న కడప సాహితీ మిత్రుల అత్యాశను గర్హిస్తూ...)

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11





● నిబద్ధత కల్గిన జర్నలిస్ట్... సాహిత్య పరిశోధకుడు

# గోపి మరణం!

జమీన్‌రైతు మాజీ సహాయ సంపాదకుడు పెన్నేపల్లి గోపాలకృష్ణ 27తేది సాయంత్రం హైదరాబాదులో మరణించారు. ఆయన వయస్సు 72 సంవత్సరాలు. గత కొంతకాలంగా ప్రాణాంతక క్యాన్సర్ వ్యాధితో బాధపడుతుండినాడాయన.

గోపీగా అందరికీ పరిచితుడైన గోపాలకృష్ణ నిబద్ధత కల్గిన పాత్రికేయుడు. దాదాపు నలభై ఏళ్ల వివిధ పత్రికలలో పనిచేశారాయన. న్యాయవాదిగా జీవితం ఆరంభించిన ఆయనలోని రచనా పటిమ గుర్తించి, తన యూత్ కాంగ్రెస్ పత్రికలో అవకాశం కల్పించి, పత్రికా రంగంలోకి తీసుకొని వచ్చాడు ఎల్‌వి.కృష్ణారెడ్డి. అప్పటి నుంచి ఆయనకు అదే వృత్తి, అదే ప్రవృత్తిగా మారిపోయింది. ఇంత సుదీర్ఘ కాలం జర్నలిస్టుగా కాలం గడిపినా చిన్నపాటి వివాదంలో చిక్కుకోలేదు. పిసరంత మచ్చ తెచ్చుకోలేదు. భాష మీద ఆయనకు ఎక్కడలేని పట్టు వుంది. సాధారణ వార్త అయినా పదునైన, పసందైన పదాలతో చదివేవారికి కవిత్వమేమో అన్పించేంత రంజుగా వ్రాసేవాడు. 1972 జైఆంధ్రా ఉద్యమం సమయంలో ఆనం వెంకటరెడ్డి ఇంటి ఎదురుగా జరిగిన జనాందోళన, పోలీసు కాల్పుల సంఘటనను పాఠకుల కళ్లకు కట్టడంలో ఆయన చూపిన పాత్రికేయ ప్రతిభ ఇప్పటికీ ఎందరో గుర్తు చేసుకొంటారు. 1979 మే నెల తుఫాను విధ్వంసాన్ని కవితాత్మకంగా వర్ణించిన తీరు కూడా గొప్పగా చెప్పుకోతగినది. ఈ తరం జర్నలిస్టులలో ఆయన వంటి పర్ఫెక్షనిస్టులు చాలా అరుదు. తను వ్రాసే ప్రతి పదం కోసం తీవ్రమైన ఆలోచన చేసేవాడు. వ్రాసిందే మళ్లీ వ్రాసి, పదుల సంఖ్యలో కాగితాలు పోగు పడిన తర్వాత కానీ వార్తకు తుది రూపం ఇచ్చేవాడు కాదు. దినపత్రికల స్పీడు యుగంలో ఆయన కుదురుకోలేక పోవడానికి అదొక కారణం. అయితే జమీన్‌రైతు, ఉదయం వంటి రాజకీయ వార్తా పత్రికలలో పనిచేసినా ఆయనకు ఆ వాసన అబ్బలేదు. రాజకీయవాదులకు, రాజకీయ వార్తలకు చాలా దూరంగా మసిలేవాడు.

ఆయన్ను పాత్రికేయుడిగా కంటే సాహిత్య పరిశోధకుడిగా ఆంధ్రదేశం గుర్తుంచుకొంటుంది. పిహెచ్‌డి పట్టా పొందిన వారికంటే ఎంతో అధికంగా సాహిత్య పరిశోధనలు చేశాడు. ఎక్కడెక్కడి పాత పుస్తకాలనో వెతికి పట్టి, వాటి చెదలు వదలించి, అక్షరం అక్షరం మధించి, సాధారణ పాఠకుడి మనసుకు తోచని కొత్త కోణాలను ఆవిష్కరించేవాడు. గురజాడ మీద ఆయన చేసిన పరిశోధన ఆపూర్వమైనది. కన్యాశుల్కంలోని మధురవాణి పాత్రకు ఆయన చెప్పిన భాష్యం అనితరసాధ్యమైనది. ఆఫ్రికా ఖండానికి కొన్ని తరాల ముందు వలస వెళ్లిన బడుగు జీవుల ఆత్మఘోషను అత్యద్భుతంగా గ్రంథస్థం చేశాడాయన. ఇంగ్లీషు సాహిత్యంలో తుఫాను రేపిన రూట్స్ గ్రంథానికి ఏమాత్రం తీసిపోని పరిశోధన దాగి వుంది అందులో.

గోపి అభ్యుదయ వాది. నెల్లూరులో అభ్యుదయ వేదిక పేరిట ఒక సంస్థ ఏర్పాటుచేసి, ఎన్నో సభలు జరిపించాడు. వర్ధమాన సమాజ కార్యదర్శిగా కవిత్రయ జయంతులకు కొత్త కళ తెచ్చాడు. ప్రోగ్రెసివ్ ఫిల్మ్ అసోసియేషన్ స్థాపకులలో ఒకడిగా సత్యజిత్ రే వంటి వారి చిత్రాలను నెల్లూరు కళా పిపాసకులకు చేరువ చేశాడు. యువ భారతి అనే కళాసంస్థ ద్వారా లబ్ధప్రతిష్టులైన కళాకారులు, సాహిత్యవేత్తలను నెల్లూరుకు రప్పించాడు. చిట్టిబాబు వీణానాదం నెల్లూరు వాసులకు విన్పింప చేయడం యువభారతి చేసిన ప్రశంసనీయ కృషిలో ఒక భాగం. పట్టాభి ఫిడేలు రాగాల డజన్ను పునర్నిర్మించాడు. శివారెడ్డి కవితలను ఎంతో శ్రమతో సేకరించి ప్రచురించాడు. హేతువాద ఉద్యమ పితామహుడు డాక్టర్ కోవూరును నెల్లూరుకు రప్పించి, బాబాల గారడీని, అమ్మల మాయను కళ్లకు కట్టించాడు. హిస్టరీ కాంగ్రెస్ సంస్థతో కూడా ఆయనకు దగ్గరి చుట్టరికం వుంది. విప్లవ సాహిత్యానికి సంకేతంగా వెలుగొందిన డాక్టర్ కెవి.రమణారెడ్డి పుస్తకాలు కొన్నింటికి ఆయన ప్రచురణ కర్త. దాని వల్ల పోలీసు నిఘా, కోర్టు కేసులు ఎదుర్కొన్నాడు. బాట్లీవాలా కుట్ర కేసు వివరాలను, ఆయనతో నెల్లూరుకు వున్న భాంధవ్యాన్ని పాఠకులకు పరిచయం చేశాడు. చరిత్ర చెత్త బుట్టలో సమాధి అయిపోయిన దంపూరు నరసయ్యను వెలుగులోకి తెచ్చాడు. ఇట్లా చెప్పుకొంటూపోతే గోపీ గారి సాహిత్య పరిశోధన అనంతం. తెలుగు సాహిత్య రంగానికి ఆయన చేసిన సేవ చిరస్మరణీయం.

మరణం సమీపించిందని తెలిసినా లెక్క చేయకుండా, చివరి ఊపిరి వదిలే వరకు గురజాడ వార్తా ప్రతులతో సావాసం చేశాడు. వాటిని పుస్తక రూపంలో తేవాలన్న చిరకాల కోరిక తీరకుండానే మృత్యువు ఆయన్ను కబళించింది.

గోపీ గారికి భార్య, అమెరికాలో స్థిరపడిన ఇద్దరు కుమారులు వున్నారు. వారి కుటుంబానికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## కెవిపికి రోశయ్య సిఫార్సు

వైఎస్ ప్రాణమిత్రుడు, వైఎస్ కాలంలో జరిగిన వేలాది కోట్ల ప్రజా ధన దోపిడీకి సూత్రధారి, వైఎస్ అనుచర ఎమ్మెల్యేలు, మంత్రులను ఇప్పటికీ తన కనుసన్నలలో తిప్పుకోగలుగుతున్న రాజకీయ చాణక్యుడు కెవిపి రామచంద్రరావును పిసిసి అధ్యక్షుడిగా నియమించమని మాజీ ముఖ్యమంత్రి కె.రోశయ్య సోనియాగాంధీకి సిఫార్సు చేసినట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. రాష్ట్రంలో ఇప్పుడున్న రాజకీయ అస్తవ్యస్తతను చక్కదిద్దగల నైపుణ్యం ఒక్క కెవిపి రామచంద్రరావుకు మాత్రమే వుందని ఘంటాపథంగా చెప్పి వచ్చాడట రోశయ్య గారు. కెవిపి అయితేనే, వైఎస్ అనుచర వర్గం జగన్ వైపుకు వెళ్లకుండా నిరోధించగలడని, ప్రభుత్వం మీద జగన్ పెడతానంటున్న అవిశ్వాస తీర్మాన గండాన్ని గట్టెక్కించగలడని రోశయ్య గారి భావన. దానికి సోనియాగాంధీ ఏమని ప్రతిస్పందించారో తెలియదు.

# సాక్షిలో మార్పులు!

జగన్ రాజకీయ ప్రచారానికి పాశుపతాస్త్రాల వలె ఉపకరిస్తున్న సాక్షి దినపత్రిక, సాక్షి టీవీ ఛానళ్లలో చాలా మార్పులు చోటు చేసుకొంటున్నాయి. సాక్షి దినపత్రిక రోజురోజుకూ నష్టాల వూబిలో కూరుకపోవడం పట్ల జగన్ కుటుంబంలో తీవ్ర ఆందోళన వ్యక్తం అవుతున్నట్లు చెప్తున్నారు. వైఎస్ బ్రతికి వున్నప్పుడు జమా ఖర్చులతో సంబంధం లేకుండా నెలకు ఎన్ని కోట్లు అవసరమైతే అన్నీ ఆయన సమకూర్చేవారు. ఇప్పుడు అధికారం లేదు కాబట్టి, బయట నుంచి నిధుల ప్రవాహం ఆగిపోయింది. ఏ పారిశ్రామికవేత్త కూడా గతంలో వలె నెల మామూళ్లు చెల్లించడం లేదు. గత సంవత్సరం ఆడిట్ లెక్కల ప్రకారమే సాక్షి దినపత్రిక నిర్వహణ నష్టం 300 కోట్లట. అనధికార అంచనాల ప్రకారం అది ఏ ఐదు వందల కోట్లనో దిగమ్రింగిందని చెప్తున్నారు. ఈనాడుకు పోటీగా సర్కులేషన్ పెంచి, అత్యధిక సర్కులేషన్ కల్గిన పత్రికగా గుర్తింపు పొందాలని జగన్ చేసిన ప్రయత్నం వల్ల ఇంత నష్టాలు పోగు పడ్డాయి. దీనితో కలత చెందిన జగన్ సతీమణి శ్రీమతి భారతి తానే స్వయంగా సాక్షి ఆర్థిక వ్యవహారాలను పర్యవేక్షించడానికి సంకల్పించారట. నష్టాలు తగ్గించడానికి ఆమె చేపట్టిన చర్యలలో భాగంగా ఇప్పటికే సాక్షి దినపత్రిక పేజీల సంఖ్య తగ్గిపోయింది. అనుబంధాలు తీసి పక్కన పెట్టారు. సర్కులేషన్ కూడా బాగా తగ్గించి వేశారట. ఈనాడుకు దాదాపు సమానంగా వుండిన ప్రతుల సంఖ్య ఇప్పుడు ఈనాడులో సగానికి దిగజారి పోయిందని చెప్తున్నారు.

మరొకప్రక్క సాక్షి టీవీలోనూ సంస్కరణలు మొదలైనాయి. ఇంతకాలం సిఇఓగా వుండిన ప్రియదర్శిని రామ్‌ను ఆ పదవి నుంచి తొలగించారు. సాక్షి టీవీలో ఇక నుంచి ఆయన బొంగురు గొంతు, విషాద స్వరం వినపడవు. సాక్షి వీక్షకులకు పెద్ద రిలీఫ్ అది. పెద్ద ఎత్తున సిబ్బందిని కూడా తొలగిస్తున్నారని చెప్తున్నారు. మరొకప్రక్క జాతీయ స్థాయిలో అత్యంత ప్రజాదరణ కల్గిన ఇంగ్లీషు టీవీ ఛానల్ ఎన్డీటీవీతో సాక్షి వ్యూహాత్మక ఒప్పందం కుదుర్చుకొంటున్నదని తెలుస్తున్నది. కొంత భాగం వాటాను కూడా వారికి అమ్ముతున్నారట.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.